# ఇతిహాసమంజరి

మేడపాటి సూర్రెడ్డి, బి. ఏ., బి. ఇడి.,
హెడ్మాష్టరు
గవర్నమెంటు హైస్కూలు
గద్వాల




కవిరాజ పబ్లిషర్సు
తెనాలి :: సికింద్రాబాదు

కాపీరైటు] 1957 [వెల : రు. 1-4-0

# వి ష య సూ చి క

# 1. పృథురాజు

భక్తాగ్రేసరుం డగు ధ్రువుని సంతతియం దంగు డను మహారా జుద్భవించెను. సద్గుణరాశి యగు నంగమహీపాలునకు దుర్గుణముల ప్రోవగు వేనుఁ డుదయించెను. అంగ భూపాలునకు వేనుని జన్మమువలనఁ జింతయేగాని సంతసము లేదాయెను. వేనుఁడు ప్రమత్తుఁడై యధర్మప్రవర్తనకు లోఁబడెను. కుమారుని చేష్టలు తండ్రికి దుస్సహముగ నుండెను. ఈతని దుర్మార్గ ప్రవర్తన లంగరాజునకు సంసారమునందు విరక్తి జనింపఁజేయ నొక యర్ధరాత్రమున నిద్ర నుండి మేల్కాంచి యెరికిం గానరాక సర్వమునుఁ ద్యజించి కాననముల కేగెను. అప్పుడు పురోహితులును, బంధువులును, దమ ప్రభువు కానరామికి దుఃఖించి వెదకఁజొచ్చిరి. కాని వారి శ్రమ లన్నియు నిరర్థకము లాయెను.

అంతటఁ బ్రజ లరాజకభీతిచే భృగ్వాదులగు మునీంద్రులను వేడుకొనఁగ వారలు వేనునే పట్టాభిషిక్తునిఁ గావింప నియమించిరి. ఇది మంత్రుల కసమ్మతి యైనను మునీంద్రుల వాక్సరణి నట్లు గావించిరి. వేనుఁడు సింహాసనాసీనుండై యైశ్వర్య మదమునఁ గన్నుఁ గానమి దుష్కార్యములకుఁ గడంగుచుండెను. చిన్నపెద్దల తారతమ్య మరయక చరించుచుండెను. తుదకు భగవానునియందును నిరసనభావముఁ జూపించు చుండెను. అతని జ్ఞానహీనత, దయామయుండగు సర్వేశ్వరునిఁ దూలనాడుటకుఁ బ్రారంభింపఁ జేయుటయే గాక తన దేశమునందలి ప్రజలను యాగహోమాదులు, దాన

ధర్మాదులు సలుపరా దనియు శాసించెను. ఈ శాసనమునకు యాజ్ఞికులైన భృగ్వాది మునులు తహతహలాడిపోయిరి. తాము వానికిఁ బట్టముఁ గట్టినందులకు విచారించిరి.

అప్పుడు ఋత్విజు లంద ఱొకచోఁ గూడి కర్తవ్య మాలోచనఁ జేయఁ గడంగిరి. "ఈతఁడు తన క్రూరత్వము విడువక ప్రజల బాధించుచున్నవాఁడు. ఇతని మదాంధత దేవుని సహితము దూరుచున్నది. ఇట్టి ప్రభువు మనకున్నను లేకున్నను నొకటియే. కాని ముందు వానిని బ్రార్థించి సత్పథమునకుఁ ద్రిప్పఁ బ్రయత్నింతము. లేనియెడల వీఁడు భూతములకు ద్రోహముఁ జేయుచునే యుండును." అని నిశ్చయించి వేనుభూపాలుఁ జేరఁజని వినయపూర్వకముగ నిట్లు ప్రార్థించిరి. "ఓ మహాప్రభూ! మా విజ్ఞాపనము సావధానముగ విన వేడెదము. యాగహోమాదులచే భూతములను దృప్తిపరుపనియెడలఁ బ్రజలకు ముప్పు వాటిల్లును. దేశ మరిష్టములపా లగును. హోమాదులవలననే యింద్రాది దేవతలు సంతుష్టులై మన కోర్కెల నీడేర్చుచున్నారు. ఆపత్కాలమున రక్షించున దీశ్వరారాధనయే. వర్ణాశ్రమ ధర్మములు నశించిన భూపాలుని రాజ్యమున సిరి నిలువనేర" దని విన్నవించిన వేనుం డిట్లనియె. "ఓ మునివరులారా! భూపాలు రీశ్వరాంశ సంభూతులు. కావున మేమే మీకు సర్వస్వమును అన్నవస్త్రము లిచ్చి యాదరించు మమ్ము మాని మఱి యెవనినో పూజించుట ధర్మమా? మేము నడచునది యధర్మమార్గమా? ఇట్లనుటకు మీకేమైనను మతిభ్రమ గల్గినదా? ఱేపటినుండి మమ్ములనే పూజింపుఁడు. పొండు."

అని కూయఁ జొచ్చెను. దుష్టమార్గగామి యగు వేనుఁడు యజ్ఞపురుషుని సహితము నిందించుట మునీశ్వరులు సహింప లేక యాగ్రహోదగ్రులై వాని నంతమొందించుట పాపకార్యముఁ గాక లోకములకు లగ్గగునని యెంచి తమ తపో మహిమచే వానిని జంపి యాశ్రమములకుం జనిరి.

కాని రాజులేని రాష్ట్రమునఁ బ్రజ లెన్నటికిని సురక్షితముగ నుండఁజాలరు. జార చోరుల వలన భయంబు హెచ్చెను. ప్రజలకు విచార మెక్కుడాయెను. యాగాదులు చోరుల భయమున నిరాటంకముగ జరుగవాయెను. దేశ మంతయు నరాజకముగ నుండెను. అంతట ఋషీశ్వరులు తా ముపేక్షించినచో దేశము మఱింత నాశ మగునని తలఁచి మృతిజెందిన వేనుని బాహువులను మథింపగా దంపతు లిరువురు జన్మించిరి. అందుఁ బురుషుని లక్షణములఁ జూడ నతఁడు నారాయణాంశ సంభూతుం డని తోఁచును. ఆ మానినీతిలకము విష్ణు నెప్పు డెడఁబాయని లక్ష్మీదేవి యట్లు కన్పట్టును. పృథురాజు పుట్టువునకు గంధర్వాది దేవతలు పుష్పవృష్టిం గురిపించిరి. ప్రపంచ మంతయు జీవ కళలచే వెలుఁగుచుండెను. మునీశ్వరుల సంతోషమునకు మేఱయే లేదు. ప్రజలు ప్రమోదాంతరంగులై తమ నూతన ప్రభువును జూడ గుంపులు గుంపులుగఁ బోవఁజొచ్చిరి.

శుభముహూర్తంబున ఋషీశ్వరులు పృథురాజుం బట్టాభిషిక్తుని గావించిరి. పట్టాభిషేక సమయమున నష్టదిక్పాలకులు పృథురాజునకు గొప్పగొప్ప వరముల నొసఁగి మోదమును బొందిరి. తక్కుంగల దేవతలును దమ కుచిత

మైన వరము లిచ్చిరి. ప్రజ లిచ్చు కానుకలు గణింప వీలు లేకుండెను.

పృథురాజు ధరణీకాంతను జేకొనినదాదిగఁ బ్రజలే దుర్భిక్షములు లేక సుఖజీవులై యుండిరి. ఆ యేలిక పరిపాలనమున ధర్మము చతుష్పాదముల నడచు చుండెను. అతఁడు దుష్టశిక్షణ శిష్టరక్షణములం దారితేరెను. జార చోర భీతి యడుగంటెను. యాగాదులు నిరాటంకముగ జరుగుచుండెను. ఋత్విక్కులు తమ కార్యములను నిర్భయముగఁ జేసికొనుచుండిరి. అతఁడు వర్ణాశ్రమ ధర్మముల నాచరించువారలలోఁ బ్రథముఁడు. దుర్భిక్షకాలములోఁ బ్రభుత్వపు బొక్కసములలోని ధనమును బ్రజల సౌకర్యము కొఱకు వినియోగించు చుండెడివాఁడు. ఇతని భూతదయకు మేరయే లేదు. సమస్త ప్రాణులను మిక్కిలి దయగలవాఁడై యాదరించు చుండెను. ఈ ధరాధవుని సత్యవాక్య పరిపాలన ప్రశంసనీయము. ఇతని సహనగుణమునకు సాటియే లేదు. ప్రజావత్సలుఁడై ప్రజ లెన్ని తప్పులఁ జేసినను వారిని మన్నించి సత్పథమునకుఁ ద్రిప్పఁ బ్రయత్నించును. దుర్జనుల యెడ యమసదృశుండై మెలంగును. ఈ ప్రభుని చేష్టలు దురూహ్యములు. గంభీరమగు నితని యభిప్రాయముఁ గనుఁగొన నేరికిని సాధ్యముగాదు. నిగూఢతమమగు మనస్సుచే శత్రువులను సులభముగ లోబర్చుకొనుచుండెను. ఎంత పరాక్రమముగల పరరాజైన నితని ముందర వినమ్రుఁడై యుండవలసినదే. దండనార్హుఁడు గానిచో నతఁడు శత్రువు నైనను దండింపఁడు. దండనార్హుఁ డైనచో పుత్రుని నైనను

క్షమియింపఁడు . ఈ భూపాలుని కీర్తి యష్టదిక్కుల దాటుచుం డెను. దిక్పాలురును వారి భార్యలును వీనికి నైవారము లిచ్చుచుండిరి. వారిచ్చు దీవనలా యపరిమితము. ఇట్టి సద్గుణముల ప్రోవగు నా భూపాలుఁడు విష్ణ్వంశ సంభూతుఁడు కాఁడని యెవరు చెప్పఁగలరు! ఇట్లు దయా సత్య శౌచాదు లచే పృథురాజు బృథ్వీపరిపాలనఁ గావించుచుండెను.

ఇట్లు కొంతకాల మరిగిన తరువాత నా నరపుంగవుని రాజ్యమున క్షామము పొడఁగట్టెను. ప్రజ లారాజు మ్రోలంబడి తమ కష్టముల నివేదించుకొనిరి. అతఁడు ప్రజల కష్టములఁ బాపు బాధ్యత ప్రభునిదై యున్నదని యెరింగిన తేఁడు. కాని ప్రజల కష్టములతో తమ కేలయన్న ప్రభువు మాత్రము కాఁడు. ప్రజల దీనాలాపము లాలకించి విచారమగ్నుండై గత్యంతర మాలోచింపఁ గడంగెను. భూదేవి యోషధు లన్నియు హరించుటచే క్షామము సంభవించినదని గ్రహించెను. అంత నామెపై క్రోధంబుం బూని బాణంబుఁ జేకొని విల్లెక్కుపెట్టి దానిం గొట్ట సమ కట్టెను. ధనుర్బాణధరుండగు నా జేనిం జూచి భూదేవి భీతిల్లి గోరూపమును ధరించి పరుగిడఁ జొచ్చెను. పృథురాజు దాని వెంటాడెను. ఇట్లు వారిరువురు నొకరివెంట నొకరు భూమ్యాకాశంబులఁ బరుగులెత్తుచుండిరి. భూదేవి మృత్యు భీతిచే హరినిఁ జూచిన హరిణంబు భంగిఁ బర్విడఁ జొచ్చెను. కాని తా నెచ్చటికి బోయినను బృథుచక్రవర్తి వెంట వచ్చుటఁ జూచి రక్షణోపాయముఁ గానక భూపాలు నుద్దేశించి భూదేవి యిట్లు పలికెను. "ఓ రాజా! అబల

నగు నాపై నీకింత క్రోధమేల ? స్త్రీహింస పాతక మనునది నీ వెఱుంగవా ? భూతదయయందుఁ బేరెన్నికఁ గన్న వాఁడవు. అపరాధినైనను రక్షించునట్టి వ్రతముగలవాఁడవు. అట్టి నీవు నిరపరాధినగు నన్నేల వధింపఁ జూచెదవు ? నన్ను వధించినచో నీవును నీ ప్రజలు నెచ్చట నివసింతురు ? నన్నుఁ జంపి మీరు నీట మునుంగుదురా ?'' అనిన రాజిట్లనియె. "ఓ పృథ్వీ ! నీవు నిరపరాధినివి కావు. రెండపరాధములను గావించితివి. అందు మొదటిది నా యజ్ఞయాగాదుల యందు దేవతారూపమున నీ భాగమును నీవు పొందుచుఁ బ్రజల కనుకూల ఫలంబు లొసంగుట లేదు. వారలవలన నీ వుపకారమును బొంది ప్రత్యుపకారము చేయకుండుట రెండవది. నేను లేనిచో నీవును నీ ప్రజలును నివసించుట కే యాధారము లేదని పలికి నిన్ను నీవు పొగడుకొంటివి. ఆత్మస్తుతి జేసికొనువారలను స్త్రీ పురుషాది విమర్శనము విడిచి హింసింపవచ్చును. నీవు పోయినతరువాతఁ బ్రజలకును నాకును నా యోగబలముచే నాధారము కల్పింతు''నని గర్జించి పలుకుట విని చేయునదిలేక భూమి యంజలి యిడుచు వాని పాదముల మ్రోల వ్రాలెను.

"ఓ పరమ పురుషా ! సత్త్వాదిగుణకార్యములకుఁ బ్రధానమగు మాయచే మోహచిత్తురాలనై నిన్నింతవరకు పృథురాజు వనియే తలఁచితిని గాని విష్ణ్వంశసంభూతుఁడ వని తెలిసికొననైతిని. నీవు ప్రకృతియందలి సమస్త వస్తువుల యథార్థమగు జ్ఞానము తెలిసిన పరబ్రహ్మవు; సృష్టికర్తవు. సమస్త జీవుల కాధారముగ నన్ను సృజించి మరల చంప

నెంచుచుంటివి. ఇదంతయు నీ సంకల్పమున నే జరుగుచున్నది, నీవు నన్నుఁ జంపనెంచుట పిచ్చుకపై బ్రహ్మాస్త్రము వైచినట్లగును. కావున నో పరమపురుషా! నన్ను క్షమియింపుము. నీ చిత్తము చొప్పున నడచుదానను. తెలియక చేసిన నేరమును క్షమియింపుము.'' అని పలికి పలువిధములఁ బ్రార్థించెను.

భూదేవి యెన్నివిధముల బ్రార్థించినను ప్రసన్నుఁడు కాకుండుటఁ జేసి కోపము నుపశమింపఁ జేయుటకై మఱల భూదేవి వేడుకొన దలఁచెను. ప్రజారంజకుండగు తేని రౌద్రము, ప్రజలను రక్షించునట్టి యుపాయము జెప్పినఁగాని ప్రసన్నము కాఁడని నిశ్చయించి సవినయముగ నిట్లనియెను. "ఓ నరవరపుంగవా! ఎట్టి కార్యమునైన నుపాయముచే సాధింపవచ్చును. ప్రజల జీవనోపాధికిఁ బూర్వ మార్యు లనేక కృషులు కల్పించి యుండిరి. ఆ కృషుల నెవ్వఁడు శ్రద్ధాళువయి పనిచేయునో వాఁడు వస్తుజాలమును బొంది సుఖం బొందును. కానియెడల నెంత పట్టుదలతో పనిచేసినను నిరర్థకము లగును. మఱియు సృష్టికర్తయగు బ్రహ్మ యీ లోకము నిమిత్తము, యాగాదులకొఱకు నోషధుల సృజియించెను. ఆ యోషధులు సద్వినియోగము సేయఁబడలేదు. దురాత్ములచే ననుభవింపఁబడుచుండెను. ఓషధులు నశించిన యాగాదులుఁ జేయుట వలనుపడదని యుద్దేశించి వానిని నేను స్వీకరించితిని. చిరకాల మగుటచే నవి నాయందు జీర్ణించెను. మహాప్రభూ! నీవు భూతములను రక్షించుటయందు బద్ధకంకణుండవై యున్నవాఁడవు. కావున నాయందు జీర్ణించి యున్న యోషధులను గొనుము. గోరూపమున నున్న

నాకొక వత్సమును గల్పించి క్షీరరూపమున నున్న యోషధు లనుఁ బితుకుము. అట్లొనరించిన యనంతరము భూమి నంతయు మిట్టపల్లములు లేక సమముగ నీరు పాఱుదలకు వీలుగా నుండున ట్లొనర్పుము. అంతట బాలను భూమినం తటిం జల్లిన సమస్త సస్యములు ఫలించును. ప్రజల క్షామము నశించిపోవును. అప్పుడు నీవు గృతార్థుఁడ వగుదు"వనియెను.

అది విని పృథుభూపాలుండు తన రౌద్రము నుపసంహ రించి ధరణీదేవత వాక్సరణిం జేయ నిశ్చయించెను. అంతట పృథుచక్రవర్తి హిమవంతమును వత్సముగాఁ గల్పించి తన యరచేతినిఁ బాత్రగాఁజేసి క్షీరరూపముననున్న యోషధు లను బితికెను. తదనంతర మా రాజేంద్రుఁడు దన బాణ పరంపరలచే మెట్టలను పల్లముచేసి, భూమినంతయు సమ ముగా నొనర్చి పాలను గలయఁ జల్లెను.

పృథురాజు పృథివినుండి యోషధులను గ్రహించిన యనంతరము సమస్త జాతులు తమకుఁగల పెద్దను వత్సము గాఁజేసి తమకుం గావలయు సమస్త యోషధులం గైకొనెను. మునీశ్వరులు బృహస్పతిని వత్సముగాఁజేసి ఛందోమయమైన పాలను బితికిరి. దేవేంద్రుని వత్సముగాఁజేసి దేవతలు బంగారు కలశమున జరామరణ నివారకమగు నమృతమును బొందిరి. పాములు తక్షకుని వత్సముగాఁజేసి సమస్త విషములం గొనె. పిశాచములును, రాక్షసులును మద్యము, మాంసము, రుధిరము నొసఁగు పాలను దీసిరి. పశువులు నందికేశ్వరుని వత్సముగాఁజేసి వన మను పాత్రమున తృణ మను బాలను బితికినవి. గరుత్మంతుని వత్సముగాఁజేసి

పక్షులు క్రిమికీటకాదులను ఫలవృక్షములను బొందినవి. వృక్షములు మఱ్ఱిచెట్టు మూలమున తీపి, చేదు, వెగటు మొదలగు రుచులనిచ్చు పాలను బితికెను. ఇట్లెల్లభూతములు తమ కిష్టమగు సమస్త వస్తుచయమును గొనినవి.

పృథురాజు ప్రభావమువలన మలమల మాడుచున్న ప్రజలు, తదితర భూతములు, తమ జీవనౌషధములం గొని సుఖంబుండిరి. అంత నా ధరావల్లభుండు సంతుష్టాంతరంగుఁడై తనకు భూమిపైనున్న కోపము నుపశమింపంజేసి యామెను దన కుమారివలెఁ బ్రేమించుచుండెను.

ప్రజల కష్టములను గట్టెక్కించి యా మేదినీవల్లభుండు సరస్వతీ నదీతీరంబున నూ ఱశ్వమేధయాగంబులు సేయ నిశ్చయించి యొక పుణ్యదినంబునఁ దన పురంబును విడచి యచ్చోటికి విచ్చేసెను. పృథురా జశ్వమేధంబులను జేయుచున్నవాఁ డనువార్త విని దేవతా మునిగణంబు లమందానందంబు నొంది, యా యజ్ఞంబును జూచుటకుం|జనుదెంచిరి. వచ్చినవారల కాతఁడు స్వాగతము నిచ్చి యుచితాసనముల నాసీనులం జేసెను.

హోమమునకుం గావలయు సకల పరికరములు కోరకయే భూమి సమకూర్చుచుండెను. భూత తృప్తికై వలయు సకల వస్తుచయము సిద్ధమగుచుండెను. రససముదాయముల నచ్చటి నదు లిచ్చుచుండెను. హోమగుండమునకు వలయు నేయి భాండములలో నక్షయముగ నిండియుండెను. సుప్రసిద్ధులగు ఋషీశ్వరులచే యజ్ఞములు జరుపఁబడుచుండెను. దేవతలును, ప్రజలును వేనకువేలు కానుక లర్పించుచుండిరి.

ఇట్లు తొంబదితొమ్మిది యశ్వమేధములు నిర్విఘ్నముగాఁ గొనసాగెను.

ఇంద్రుఁ డిది యంతయు నాకాశమునుండి తిలకించు చుండెను. అతని సింహాసన భ్రష్టత్వమునకుఁ దొంబది తొమ్మిది సోపానములు సమకూర్పఁబడెను. పృథురాజొనర్చు యాగముల సంఖ్య యెక్కువగుకొలఁది యింద్రుని యీర్ష్యయు నధికమగుచుండెను. నూఱవ యశ్వమేధము ప్రారంభించు నప్పటి కీర్ష్యాభాండము పొర్లిపోయెను. ఇంద్రుఁడు దనకు రానున్న యాపదనుండి విముక్తుఁడగుట కుపాయము లెన్నుచుండెను. యాగాశ్వమును దొంగిలించి యజ్ఞమును విఘ్నపరచుట కుద్యుక్తుఁడయ్యెను. తాను నిజరూపమున వచ్చినచో మోసము వాటిల్లఁగలదని పాషండవేషమును ధరించి యశ్వరాజంబునుం గొని చనియెను. ఇది యత్రిమహాముని కనుంగొని పృథురాజకుమారుని కీ యుదంతమును దెలిపెను. ఆతఁడు వెంటనే బాణంబు చేఁబూని యింద్రుని జయించి యాగాశ్వంబును దెచ్చుటకు బయలుదేరెను. పాషండ రూపమున నున్న యింద్రుని జూచి యాతఁ డెవ్వండో ధర్మమూర్తి యని సంకోచించి మగిడి వచ్చెను. అంతట నత్రిమహాముని యా పాషండ రూపమున నున్నవాఁడే యింద్రుఁ డనియు నిట్టి యధర్మ వేషమున నుండుటచేఁ జంప నర్హుఁడని చెప్పి మఱలఁ బంపెను. పృథురాజుపుత్రుఁడు తనను వెంటాడుట గమనించి యశ్వము నచ్చటనే విడచి యింద్రుఁ డంతర్ధానము నొందెను. అంత టా రాజకుమారుండు యాగాశ్వమును గొని యజ్ఞస్థానమునకుఁ బోయెను.

ఈ ఘనకార్యమునకు మునీశ్వరు లద్భుతమంది యాతనికి విజితాశ్వుం డను సార్థకనామ మొసంగిరి.

ఇంద్రుం డంతతో నూరకొనక మఱియు యాగాశ్వ మపహరించెను. విజితాశ్వుఁడు మఱల వెంటనంట నింద్రుం డంతర్ధానుఁ డయ్యెను. అప్పుడు విజితాశ్వుఁ డా హయమును యాగశాలకు గొనిపోయెను. దేవేంద్రుఁడు పాషండ రూపమున వచ్చుటచే నచ్చటివా రెల్లరు వానిని నిందించు చుండిరి. ప్రజలలో పాషండాచారము దీనిమూలముననే ప్రబలెను. భస్మధారణము, దిగంబరత్వము, కాషాయ వస్త్రములు, మొదలగు పాషండాచారములు ధర్మములనెడి భ్రాంతి గలిగించునే గాని యథార్థముగ ధర్మసమ్మతములు గావు.

దేవేంద్రుఁడు చేయుచున్న విఘ్నములను సహింప నోపక పృథురాజు ధనుస్సునుం గొని వానిని జంపుటకు బయలుదేరెను. అట్లు కృతనిశ్చయుండైన రాజుం గని యత్రి మహాముని యిట్లనియెను. "ఓ మహాపురుషా! నీవు శాంతుఁడవుగమ్ము. నీ యాగమును ధ్వంసంబుఁ గావింప నెంచిన యా పాషండుని మహత్తరములగు నాహ్వానమంత్ర ములచే రప్పించి హోమగుండమున భస్మము జేయుద"మని నివారించి యా మంత్రములను బఠింప మొదలిడెను.

ఆ క్లిష్టపరిస్థితులు సూచి యాలసించినచో ముప్పు వాటిల్లునని బ్రహ్మదేవుఁడు ప్రత్యక్షమయి ఋత్విజులను వారించి పృథురాజుం గని "ఓ మహారాజా! ఇంద్రుండు పాషండ వేషమున వచ్చినంత మాత్రమున వధార్హుఁడు గాఁడు. వానిపై

కోపించుటయు యుక్తంబు గాదు. మీ రిరువురును భగవంతు నకు శరీరమువంటి వారలు. మీ రన్యోన్య ప్రేమగలవారలై యుండవలయును. తొంబది తొమ్మిది యాగములు మాత్రమే చేసినప్పటికి నింద్రునివలె గొప్పకీర్తిఁ గలవాఁడ వయ్యెదవు. అదియునుంగాక దేవేంద్రుఁడు పాషండరూపమున వచ్చు టచే నీ యాగము ధర్మసాంకర్యమును బొందినది. అందు వలన దేవతలు తృప్తినొందఁజాలరు. కావున నీవు యజ్ఞంబు మానుట యుచితంబు. ప్రజాపతు లే యభిప్రాయమున నిన్ను సృజించియున్నారో యా సంకల్పము నెరవేర్పుము. ఇంద్రుఁడు పాషండరూపమున వచ్చుటచేఁ బ్రజ లట్టి పాషండాచారము లవలంబింతురు. అది యధర్మము గావున నీ వీ యింద్రమాయ నీ ప్రజల కంటకుండఁ గాపాడుము. దానికి నీవే సమర్థుండవు" అని యానతిచ్చెను.

అప్పు డా మహీపతి బ్రహ్మాజ్ఞను యజ్ఞంబుచేయుట విరమించి యింద్రునితో సఖ్యము గావించుకొనియెను. దేవతలు పృథురాజునకుం గావలయు వరంబుల నిచ్చి తమ తమ తావులకుం జనిరి. అతఁడు భూసురోత్తములను, యాచకులను, దానములచే సంతృప్తులం జేసి వారివారి నివాసములకుం బంపెను.

పృథురాజు తన పురంబునకుం బోవ సంసిద్ధుఁడైయున్న తఱి నాదిమధ్యాంతరహితుండును, సర్వాంతర్యామియును, జ్ఞానాది గుణముల మేటియు నగు యజ్ఞపురుషుండు దేవేంద్రునిఁ దోడ్కొనివచ్చి భూపాలునకు సాక్షాత్కరించెను. ప్రసన్నుండైన యాదినారాయణుండు పృథురాజుతో నిట్లనియెను:

" ఓ రాజా! నీవు చేయు యజ్ఞంబుల కభ్యంతరములు గలిగించిన దీతఁడే. తన్మూలమున వీనిపై క్రోధంబును బూనక క్షమియింపుము. దేహాత్మల తత్త్వము గ్రహించినవార లిట్టి వానిని బాటింపరు. మీ రిరువురు నాకు సములు. మీ రసాధారణ పురుషులరు. కావున నీతఁడు చేసిన యపరాధ మును మన్నింపవలయును. చేయునది, చేయించునదియుఁ బ్రకృతియే. సుఖదుఃఖములకు సముఁడవై రాజ్య పరిపాలనఁ గావింపుము. ఇట్లుండుట వలన మోక్షము వచ్చునా యని శంకింప వలదు. ధర్మయుక్తంబుగాఁ బరిపాలించిన యేలిక ప్రజల పుణ్యములో నాఱవపాలు గొనును. అధర్మపరుఁడై సంచరించిన యెడలఁ దనకుం గల పుణ్య మితరులకుం జెందఁ జేయుటయే గాక ప్రజల పాపమునుగూడఁ గొంత గైకొనును. దానంజేసి ప్రజాపాలనమే శ్రేయస్సాధనము. వర్ణాశ్రమ ధర్మము లాచరించుచు బ్రజలలో నీవును నొక్కండవని చరించినచోఁ బ్రజారంజకుండ వగుదువు. ఇట్లు ప్రవర్తించి నచో నీ గృహంబునకే మహామునులు వచ్చి నిన్ను సందర్శించెదరు. నేను సుస్వభావముచేత వశుఁడనైనట్లు తదితర తపంబులచే వశుఁడనుగాను. కావున యాగ విఘ్నం బునకై చింతింపకుము.

పృథురాజు విష్ణుశాసనమును శిరసావహించెను. క్షమింపుమని తన పాదములం బడిన దేవేంద్రుని లేవనెత్తి గాఢాలింగనముం జేసికొని యాతనితో సఖ్యము గావించుకొని యెను. భగవంతుఁడు పృథు ప్రవర్తనమునకు మెచ్చుకొని

యాతఁడు చేసిన పూజాసత్కారములం గైకొని యంతరిక్షమున నంతర్థానుం డాయెను.

అనంతర మా ధరణీవల్లభుండు సంతుష్టాంతరంగుఁడై పరివారంబు తన్నుఁ గొలువ పుణ్యక్షేత్రమగు నా సరస్వతీ నదీ తటమును విడిచి పురాభిముఖుండై చనుచుండెను. భూనభోంతరాళముల నిండియున్న యీ జేనికీర్తినిఁ బొగడుచు వందిమాగధులు ముందు జనుచుండిరి. తమ రాజు రాకకై పురంబును రమణీయంబుగ నలంకరించి ప్రజలు పురబహిర్ద్వారమున వేచియుండిరి. ఆ పురము రాజమార్గములం దెల్లెడల రంభాస్తంభంబులతోడ, పోకవృక్షములతోడ, నలంకరించి యాకాశ మంటునంతటి జిలుగు పందిళులు వేయించిరి. అవి పుష్పములచేతఁ జిత్రవిచిత్రములగు శిల్పనైపుణ్యములచేత నలంకరింపఁబడెను. పరిమళ వస్తుసముదాయములచే వీథులన్నియు మిక్కిలి సువాసన గొలుపుచు నతిమనోహరముగఁ జూపట్టెను. ప్రజ లలంకారభూయిష్ఠులై పూజాద్రవ్యములతోను, మంగళప్రదమగు వస్తుచయముతోను దమ జేనికభిముఖులై పోయి స్వాగత మిడుచుండిరి. శంఖనినదంబులు మిన్నుముట్టుచుండెను. అట్టితఱిఁ బృథు భూపాలుండు పురప్రవేశముఁ జేసెను. మేడలపైనుండి పురాంగనలు మంగళహారతుల నిచ్చుచు బుష్పవృష్టిఁ గురిసిరి. బ్రాహ్మణుల వేదఘోష ప్రబలుచుండెను. అట్టి యత్యానంద సమయమునఁ బృథురాజు గర్వరహితుండై తన మందిర ప్రవేశము గావించెను.

పురప్రవేశంబు జేసి యతఁడు ప్రజలకు నిష్టవరంబుల నొసంగుచు రాజకార్యనిమగ్నుం డయ్యెను. అద్భుత కర్మముల నొనరించుచు బ్రజలను రంజింపఁజేసి రాజను సార్థకనామము వహించెను. ఆతఁ డేలునది బ్రహ్మావర్తమైనను శాసనము సప్తద్వీపముల యందునుం జెల్లుచుండెను. ఆతఁడు తనతో సముఁడగు మఱొక్కనిఁ గానకపోయినను నిగర్వియై యుండెను.

కొంతకాల మరిగినతరువాతఁ బృథురాజు గొప్పదగు సత్రయాగ మొకటిఁ జేయ మొదలిడెను. ఆ సత్రమున దేవర్షుల సభ యొకటి సమకూర్పఁబడెను. ఆ సభామధ్యమున పృథురాజు నిలువంబడి ముచ్చటింప దొడఁగెను. పద్మపత్రములవంటి నేత్రములును, విశాలవక్షమును, నాజానుబాహులును, సుందర లలాటమును గలిగియున్న యాతనిఁ జూడ నారాయణాంశ సంభూతుం డని చెప్పవచ్చును. "ఓ సభాసదులారా! బ్రహ్మచేఁ బ్రజలను శాసించుటకు నియమింపబడితిని. ప్రజలు తమ తమ వర్ణాశ్రమ ధర్మముల నాచరించునట్లొనర్చు బాధ్యత నాయందు నిలిచి యున్నది. వర్ణాశ్రమ ధర్మముల నెవరు విడువక నాచరింతురో వారు నా యాజ్ఞ శిరసావహించినవార లగుదురు. అదియే పుణ్యగతులం గూడ నందంజేయును. మఱేవిధమైన ప్రవర్తనయు భగవానుని ప్రసన్నుని గావింపనేరదు. మఱియు రాగద్వేషాది దోషములు లేని బ్రాహ్మణులం బూజింపవలయు" నని చెప్పి తన యాసనమధిష్టింపఁగా సభాసదు లందరు వాని

సద్వర్తనకు మెచ్చి జయ జయ ధ్వనులు గావించిరి. సభానంతరము వారు తమ తమ నివాసంబులకుం జనిరి.

తదనంతరము సనకాదులు పృథురాజుం జూచుటకు వచ్చియుండిరి. స్వతేజంబున లోకముల తమంబు నడంచు నమ్మహామునుల కతం డర్ఘ్యపాద్యాదులు సమర్పించి యథావిధి గౌరవించెను. వారలు పృథురాజునకు మోక్షమార్గముపదేశించి యంతర్ధానము నొందిరి.

ఈ మహీతలనాథుండు కొలందికాలము సార్వభౌమ సంపదలతోఁ దులందూగి వానప్రస్థాశ్రమము స్వీకరింప సంసిద్ధుం డాయెను. అతని కైదుగురు పుత్రులు గలరు. అందు పెద్దవాఁడగు విజతాశ్వుని పట్టాభిషిక్తునిం గావించి భార్యతోడ నడవులకుం బోయెను. అచ్చట నా సాధ్వీమణి భర్త కుపచారములు సల్పుచు వానికిం గావలయు పూజా ద్రవ్యములు సమకూర్చుచుండెను. పృథురాజు భౌతిక ప్రపంచమునం దనకుంగల సంబంధములు విడిచి మనుస్సును విష్ణునియందు లగ్నంబు జేసి తపస్సు చేయుచుం బరమ పదము నొందెను. మహాపతివ్రత యగు నాతని భార్య సహగమనముచేసి భర్తతోఁ గైలాసమున కేగెను.

# 2. జడభరతుఁడు

ఋషభునకు నూర్వురు కుమారులు గలరు. అందు భరతుఁడు పెద్ద. ఈ మహారాజు వలననే మన దేశము భారత వర్ష మను నామధేయమును గాంచెను. పరమ భాగవతోత్తముండగు ఋషభుం డీ ప్రపంచమును ద్యజించి పోవునప్పుడు భరతుని సింహాసనాసీనుం జేసెను. అతండు ధరణీచక్రమును జేకొని ప్రజారంజకుం డను పేరు గాంచెను.

అమ్మహీపతి పంచజని యను పద్మనేత్రం బరిణయం బాయెను. పూవుం దావియుం బోలెఁ దాను నమ్మానవతియుం గలసి మెలంగుచుండిరి. అమ్మత్తకాశినీమతల్లి జయంతు నందంబున మించు నేవురు తనయులం గనియెను. వారు శుక్లపక్షచంద్రుని పగిది దినదినాభివృద్ధిఁ గాంచుచుండిరి.

ఋషభునిచే భరతుఁ డవనీతల పరిపాలనార్థము నియుక్తుఁడై యుండుటచేత రాజ్యభోగాదు లనుభవింపవలసిన సమయ మతిక్రమించువరకు ప్రజాపరిపాలనమునందు శ్రద్ధాళువై యుండెను. ఆ రాజ్యమును విడిచి తపోవనమునకుఁ బోవుసమయము సమీపింపఁగనే తన జ్యేష్ఠపుత్రుని సింహాసనాసీనుం జేసెను. తదనంతరము భరతుఁడు పులహామహర్షి యాశ్రమమునకుం జని ఘోరనిష్ఠ నీశ్వరధ్యాన పరాయణ హృదయుండై తపం బాచరించు చుండెను. ఆ సాలగ్రామ క్షేత్రము మిక్కిలి పవిత్రమైనది. అచ్చట భక్తవత్సలుం డగు భగవంతుండు ప్రత్యక్షుం బగుచుండును. భరతుఁడు కంద మూల ఫలాదులు భుజించుచు స్వయముగనే పూజాద్రవ్య

ములను దెచ్చుకొనుచు భగవంతు నారాధించు చుండెను. అతఁడు తదేకనిష్ఠతో భగవత్పూజ సలుపుచుండుటచేఁ బ్రపంచమునుం గూడ మఱచెను. తానేమి చేయుచున్న దియు గూడ గుర్తెరుంగఁడు.

ఒకదినమున భరతుఁడు వేకువజాముననే మేల్కాంచి కాల్యకృత్యములం దీర్చుకొని చక్రనదికిఁ బోయెను. ఆ నదియందు స్నానం బాచరించి యచ్చటనే కూర్చుండి మంత్రంబు జపించుచుండెను. అట్టితఱి నిండుచూలు ధరించిన యొక యాఁడులేడి నిస్సహాయయై యా నదీతటంబున దిగి జలంబు ద్రాగుచుండెను. ఆ సమయముననే సమీపమున భయంకరముగ సింహము గర్జించెను. సహజముగ భయశీలయై యున్న యా లేడి మఱింత భయమంది నీరంబును గ్రోలకయే యా నదిలోఁ జొరఁబడెను. మిక్కిలి భయమందిన దగుటచేతను, బూర్ణగర్భంబు గల్గియుండిన దగుట చేతను బ్రవాహంబునం దుండి త్వరలో బయట పడ లేకుండెను. శరీరమునకు శ్రమనిచ్చుటచేత నా హరిణగర్భము స్వస్థానమును వీడి జలప్రవాహమునం బడియెను. సింహము తన్నింకను వెంటాడుచున్నదేమో యను భయముచే నది కొండచరియలం బర్వీడఁజొచ్చెను. ప్రాణమన్న నంత తీపిగదా! కాని దానికి మృత్యువాసన్న మాయెను. అది మిక్కిలి డస్సియుండుటచే నొక కొండగుహం జేరి మృతి నొందెను.

దయామయుండగు భరతుం డిది యంతయు గాంచుచుండెను. ఆ లేడి యొంటిపై వచ్చుటచే నా శిశువును రక్షిం

చుట కెవరు గలరు? తలిదండ్రులు లేని యీ పిల్లను జూచి మిక్కిలి జాలిఁగొని నదీప్రవాహమునం బడిపోవుచున్న దానిని భరతుఁడు లేవనెత్తి శరీర మంతయు నొత్తి తన యాశ్రమము నకుం దీసికొనిపోయెను. భరతుఁడు దానికిం గావలయు నాహారాదుల నొసంగుచు మిక్కిలి దయతోఁ బోషించుచుండెను. ఇట్లు కొంతకాలము జనునప్పటి కా మృగశిశువుపై నున్న ప్రేమచేఁ దన దినకృత్యములు క్రమముగ క్షీణింపసాగెను. అది తన దనియు, దానిని పెంపఁ దనకు బాధ్యత కల దనియుఁ దలంచి దాని నెల్లప్పుడు విడువకుండెను. ఆహారాదు లొసఁగుచు, దానిని చుంబనాదులచే లాలించుచుఁ భగవత్పరిచర్యాదులు సలుపకుండెను. ధర్మము లన్నియు నశించుచుండెను. తన సర్వస్వ మా లేడిపిల్ల యనియే భ్రమించుచుండెను. దానిం బోషించుట, సంతోషింపఁ జేయుట తనకవశ్యాచరణీయములని తలఁచెను. తన్ను రక్షకునిగా నెంచి తమ జాతివారల నేరినిం జేరకుండుటచే దానిని విడచుట మహాపాతకమని యెంచెను. భరతుఁడు పూజాద్రవ్యములకొఱ కాశ్రమము విడిచి వెళ్లునప్పుడు సహిత మా లేడిపిల్ల యతని వెంట రావలయును. అది యేకారణమువలననైనను వెనుకఁబడినచో నతఁడు దానికొఱకు నిరీక్షించుచుండును. అది యలసి నడువకున్నప్పుడు భుజములపై నిడుకొని తన యాశ్రమమునకుం జనును. అతఁడు కూర్చుండినయప్పుడు తన తొడలపై నిడుకొనును. పండుకొనునప్పుడు ఱొమ్ముపై శయనింపఁ జేసికొనును. ఇట్లు దానితో నతఁ డధిక స్నేహము గలవాఁడాయెను. అది యే కారణముచేనైనను తనకుం గానరానిచో నతని విచారము

నకు మేరయే లేదు. దాని గుణములం దలఁచుకొనుచు దుఃఖించుచుండును. ఒకానొక సమయమున మృగశిశు వెచ్చటికో పోయెను. అప్పు డతని విలాపమున కంతమే లేదు. "అయ్యో! దాని నెప్పుడైనను కఠినచేతస్కుఁడనై తూలనాడియుంటినా? లేనిచో నది యేల నన్ను విడిచి పోవును. నేను దానియెడల దుష్టుఁడనై ప్రవర్తించియుందును. నా యం దధిక ప్రేమగల మృగము నా యపరాధము మన్నించి నా యాశ్రమమున కేలరాదు? అది నా యాశ్రమ సమీపముననున్న లేతపచ్చికను దినఁగాఁ జూచు భాగ్యము నాకుం గలుగునా? అక్కటా! ఏ క్రూర జంతువైనను దానిని హతమొనరించి యుండదు గదా! పూజాద్రవ్యముల నపవిత్రము చేయునప్పుడు నేను కోపింపగా సత్పురుషునివలెఁ బ్రవర్తించుచుండెడిది. ఇట్టిదానిని విడిచి నే నెట్లు జీవింపగలను" అని పలువిధముల విలపింపఁ జొచ్చెను. వియోగదావానలంబునం బడి దహింపబడుచుండును. అది మగిడి వచ్చునంతఁ బరమానంద భరితుం డగును.

భరతుండు భౌతిక ప్రపంచ బంధములను విడనాడి యరణ్యమునకు వచ్చి మఱల భౌతిక ప్రపంచ బంధములు తగిలించుకొనెను. తాను కడుపారఁ గన్న కుమారుల నఖండ వైభవములతోఁ దులఁదూగు రాజ్యంబును విడనాడఁ గలిగిన భరతుఁడు హరిణశాబక వియోగము భరింపకుండెను; ప్రాపంచిక వాంఛ లతనిని బంధించెను. అతఁ డిదివరలో నాచరించిన తపం బంతయు వ్యర్థమాయెను. ఈ ప్రపంచ

వ్యామోహములోఁ బడెను. మృత్యు వాసన్న మాయెను. భరతునకు బ్రపంచ మంతయు మృగరూపముననే కానఁబడుచుండెను. ప్రాణావసాన కాలమున నా మృగశాబకమును జేరందీసి దానినే యాత్మజునిగా నెంచి దానియందే మనం బుంచి ప్రాణంబు విడిచెను.

భరతుఁడు మృగమే సర్వస్వముగా నెంచి ప్రాణంబు విడుచుటచే మృగమై జనించెను. కాని పూర్వజన్మస్మృతి నశింపలేదు. తన మృగజన్మమునకు గారణంబు గోచరంబాయెను. మిక్కిలి పరితాపము నొందెను. జ్ఞానవంతుల మార్గమునుండి పరిభ్రష్టుఁ డైనందులకు మిక్కిలి చింతించెను. ఈజన్మముననైనఁ గర్మరాహిత్యమును బొందవలయునని యెంచి తన తల్లియగు మృగిని విడనాడి కాలంజర మను పర్వతము నాశ్రయించెను. ఆ తావు సమస్త మునులకుం బ్రియంబు. భగవత్ప్రాప్తికి స్థానమైన శాంతియుతమగు ప్రదేశము. మృగరూపమున నున్న భరతుఁడు మునుల యాశ్రమముల వెంట జరించుచు వారలు చెప్పుకొను పుణ్యకథ లాలకించుచు సన్మార్గగామియై యుండెను. సత్త్వగుణప్రధానమైన యాహారమునే భక్షించుచు దనజాతివారలతోఁ గలియక యేకాకియై వర్తిల్లుచుండెను. ఇట్లు చరించుచు నొకానొక సమయమున నీటంబడి మృగత్వము విడిచెను.

ఆంగీరసగోత్ర సంభవుం డగు ద్విజసత్తముం డొండు గలఁడు. ఆ విప్రవరుండు వేదాధ్యయనపరుండు. శమదమాది గుణములకుఁ బేరెన్నికఁ గన్నవాఁడు. సుఖదుఃఖాది ద్వంద్వములను సమానముగ నెంచువాఁడు. అసూయ యనున

దెఱుంగఁడు. బ్రహ్మజ్ఞాన సంపన్నుఁడు. సద్గుణరాశి. ఆ భూసురోత్తమున కిరువురు భార్యలు గలరు. ప్రథమభార్యకుఁ దండ్రితో సమానులగు తొమ్మండుగురు పుత్రు లుద్భవించిరి. రెండవభార్య కిరువురు కవల లుదయించిరి. ఆ జంటలో మగ శిశువు పరమ భాగవతోత్తముం డగు భరతుఁడు. అతండు మృగశరీరమును విడిచి యీ విప్రుని భార్య గర్భంబునం బడియె. పూర్వజన్మమం దొనర్చిన భగవదారాధనా ప్రభావము వలన పూర్వజన్మానుస్మృతి నశింపకపోయెను. ఆ విప్ర బాలకుఁడు దినదినాభివృద్ధి నొందుచుండెను. పూర్వజన్మ జ్ఞానము కలిగియుండుటచేఁ దొల్లింటివలెఁ బ్రపంచవిషయ వాంఛలందు మనస్సు చొరనీయకుండెను. ఆ బాలుఁడు తన తోడివారితోఁగాని సోదరులతోఁగాని వినోదముగఁ గలసి తిరుగఁడు. ఆటపాటలయందు సహితము వాంఛ సేయఁడు. పలువు రున్నచోటికిఁ బోవువాఁడు కాఁడు. ఏకాంతముగ సంచరించుచుండెను. బాలురకు సహజముగానుండు చురుకు దన మీఁతనియందు కొంచెమైనను కానరాదు. భగవంతుని గూర్చి యెచ్చట ముచ్చటింపబడునో ఆ యా తావులయందా బాలుఁడు కాననగును. పురాణములం జదువు చోట్లకుఁ బోయి మిక్కిలి శ్రద్ధాళువై వినుచుండును. అతఁడు భగవత్కథాశ్రవణమందు కుతూహలము గలవాఁడు. భగవత్పాద ధ్యానపరాయణ హృదయుఁడు.

తమతోఁ గలిసి మెలంగకుండుటచే లోకు లాతనిని వెఱ్ఱివానిగ భావించుచుండిరి. ఆ ద్విజుండు తన పుత్రులలో నమాయకుండగు నా బాలకునియం దమితాదరము గలిగి

విద్యాధికునిఁ జేయవలయు నని తలంచెను. తండ్రి యుపదేశ ముననే పుత్రుఁడు శిష్టుండు గావలయునన్న మతము గల వాఁడు కావుననే పుత్రునికిఁ దండ్రి గురువులలో నొకఁడు. ఆ విప్రుండు బ్రాహ్మణబాలకునికిఁ గఱపవలయు విద్య లన్నియుం జెప్పెను. కాని యవి యతనికి విహితములు గావయ్యెను. తండ్రి పడుచున్న కష్టము లన్నియు వ్యర్థము లగుచుండెను. ఆ క్షణమునఁ జెప్పినది మఱుక్షణమున మఱచుచుండెను. ఆ బ్రాహ్మణుఁ డంతటితో విసుగుజెందక బాలునకు మఱింత శ్రద్ధతో బోధించుచుండెను. తన కార్యము నెరవేరకుండగనే యాబ్రాహ్మణుండు వ్యాధిచేఁ బీడింపఁబడి మృత్యువువాతఁ బడియెను. ఆ విప్రుని రెండవ భార్య తన పిల్లలను సవతి కధీనులం జేసి భర్తతో సహగమన మును జేసి పరలోకము నందెను.

భరతునకుఁ దలిదండ్రులు లేకుండుటచే నాతని నాదరించువారు లేరైరి. సోదరు లాతఁడు మూర్ఖుఁడని తలఁచి వేదాధ్యయనాదులఁ జెప్పించుటయందు శ్రద్ధ వహింపరైరి. తలిదండ్రులు లేనివాని గతి యింతియేగదా! భరతున కెవ రున్నను లేకపోయినను విచారములేదు. నిర్మలమైన మందా కినీ వీచికలఁ దూగు రాయంచ సెలయేళ్ళకుఁ జనునా? మధురమైన మందార మకరందమును గ్రోలు తుమ్మెద యుమ్మెత్త చెట్లకుఁ బోవునా? అటులనే యంబుజోదర దివ్య పాదారవింద చింతనామృత పానముచే మదించిన భరతుని మనం బన్యవిషయములఁ జొరకుండెను. అతని నొకరు

పాటించినను లేకపోయినను నొకటియే. అతనికి సర్వము సమానమే.

అమ్మహానుభావుని నిజరూపం బెరికి తెలియకుండుటచే జ్ఞానహీనులగు ప్రజలు వానిని హేళనజేయ మొదలిడిరి. తమ మూర్ఖత్వమున వానిని బిచ్చివాఁడనియు, జెవిటివాఁడనియు, జడుఁడని సంబోధించుచుండెడివారు. వారలు పిలుచు విధముననే భరతుఁడు ప్రవర్తించుచుండెడివాఁడు. జడత్వము గలిగి యుండుటచేతనే జడభరతుఁడను నామధేయము గాంచెను. ఇంద్రియ ప్రీతికై గాక జీవించుటకు మాత్రమే భక్షించుచుండెను. స్వకాయ కష్టమువలననే జీవనోపాధినిం బడయగోరువాఁడు. కూలి చేయువాఁడు. సోదరులచే ధాన్యక్షేత్రములు చక్కఁజేయ ప్రేరేపింపఁబడుచుండువాఁడు. కాని యేమిచేసిన సస్యములు బాగుగ ఫలించునో యాతనికిఁ దెలియదు. సోదరులు పెట్టు స్వల్పాహారమునే దినుచుండును. అది చాలకున్నచో వంటపాత్రల యందు మాడియున్న యన్నమును బెట్టినను మిక్కిలి హితవుగ భక్షించును. తాను కట్టువస్త్రమూ కుత్సితము. ద్విజచిహ్నముగ నొక జందెము మాత్రము గలదు. ఎన్నడభ్యంగస్నాన మెరుంగకుండుటచే నీతని బ్రహ్మవర్చస్సు "నివురుగప్పిన నిప్పు చందంబున" నుండెను. అతఁడు కఠినశిలపై శయనించుచుండెను.

భరతుని విచిత్రచర్య తెలియజేయు నొక యద్భుతకథ గలదు. అది యతని జడత్వము నిరూపించుటలో మేటి యనంజెల్లును. అక్కాలమున నిప్పటివలెఁ గాక రక్షణోపాయము

బహు తక్కువగ నుండెడిది. దానంజేసి చోరభయము హెచ్చుగా నుండెను. ప్రజల ధనప్రాణములకు రక్షణ లేదు. దేశమునం దెల్లెడలఁ జోరులు గలరని చెప్పుటకు సందియ మొంద నవసరము కాన్పింపదు. వారు పెద్ద పెద్ద గుంపులుగాగూడి గ్రామములపైఁబడి దోచుకొనుచుండెడివారు. అట్టిగుంపుల కొక నాయకుఁ డుండును. ఆనాయకున కందలి చోరు లంజలిగావించుచు నాతని యాజ్ఞానువర్తులు కావలసి నదే. లేనిచో దండనమునకు బాత్రులగుట విధి. ఆ చోరుల కతఁడే వల్లభుఁడు. అట్టి చోరశిఖామణులలో నొక్కండు భరతుఁడు నివసించు ప్రాంతమున నుండెను. అతని పేరు వృషలుఁడు. ఆతఁ డనపత్యుఁడు. పుత్రులులేనివానికి గతులు లేవను నమ్మకము గలవాఁడు. ఘోరకృత్యము లొనర్చు చోరునకు సహితము మత మనిన భయమె. ఎట్టివాఁడైనను మతమునకు లోఁబడవలసినదే. దానిని ధిక్కరించి ప్రవర్తింపఁ జాలఁడు. దాని కట్టి మహత్తరమగు మహత్త్వ ముండుటవలననే నరుఁడు విడువజాలకున్నాఁడు. కావున నా చోరునకు బరలోక భీతి కలిగెను. పుత్రులు లేకున్నఁ బున్నామనరకమును బడయుట విధి యనుకొనెను. సంతతిఁ బడయుట విధియై యున్నది. అది దైవవశమునంగాని నెరవేరదు.

ఆతఁ డొకదినమున భద్రకాళి యాలయమునకు బోయి మిక్కిలి నిష్ఠాపరుండై యామెను సంతానము కొఱకుఁ బ్రార్థించెను. ఇట్లు కొన్ని దినములు బ్రార్థించి తనకు సంతానము కలిగినచో నరబలి యిచ్చెదనని మ్రొక్కి నిజ

నివాసమునకుం జనియెను. ఇట్లుండఁ గొంతకాలమున కాతనిభార్య గర్భంబుదాల్చి నవమాసంబులు నిండ నిండు చందురుఁగాంతి విడంబించు నొక సుకుమారాకారుం డగు కుమారునిం గనియెను. ఆ వరపుత్రునియందుఁ జక్కని చిహ్నములు కాన్పించెను. ఆ చోరనాయకుని యనుచరులు తమ చిన్నప్రభువునకు స్వాగతమిచ్చి యమందానందమున నృత్యము జేసిరి. అనేక కాన్కల నొసంగిరి. జననీజనకు లపార సౌఖ్య పారావారంబున మునిఁగి తేలుచుండిరి. పున్నామ నరకభయము తీరెను. కాని యాతండు జన్మించినది దుష్ట నక్షత్ర మని యెఱుంగరు. ఆ విషయ మా మూఢులకు జెప్పువా రెవ్వరు? ఆ దోషాపహరణమునకుఁ దగిన కార్యముఁ జేయించువార లేరి? అతఁడు జన్మించిన నక్షత్ర దోష మెట్టి దనిన నా చోరనాయకునకును దదనుచరులకును గీడు వాటిల్లును. మృత్యుభయముఁ గూడ నున్నది. ఇదేమియు వార లెఱుంగరు.

వృషలుఁ డానందమున భద్రకాళికిఁ జేసిన వాగ్దానము మఱచెను. మోసగాండ్రు తమ కార్యములు నెరవేర్చుకొనిన తరువాతఁ దమ వాగ్దానములం జెల్లింపరు. ఈ విషయము వాని కెప్పటికిని జ్ఞప్తికి రాకుండెను. ఒకనాఁ డర్ధరాత్రమునఁ గాళి వానికిం గలలోఁ గనుపించి "ఓరి కృతఘ్నా! నీవు మదాంధుఁడవై చరించుచుంటివి. చెల్లింపని వాగ్దానములఁ జేయనేల? నీవు నీ శపథము ప్రకారము జరుపనిచో హాత మొందింతు" నని చెప్పి యంతరానమయ్యెను. వృషలుఁడు వేకువనే లేచి కలలో జరిగిన

యుదంత మంతయు భార్యకుం జెప్పెను. ఆమె గడగడ వణఁకుచు భర్తను నమ్మవారికిం జేసిన వాగ్దానమును నెరవేర్పుమని ప్రార్థించెను. లేనిచో బాలునకును దండ్రికిం గూడఁ గీడు సంభవించు నని తలఁచెను. అప్పుడు వృషలుఁడు తన యనుచరులం బిలిచి కాళి యాజ్ఞను దెలియఁజేసెను. అంతట వారలు దమ యేలికకు రానున్న యాపదకు భయకంపితులై నరబలి నియ్య సమకట్టిరి.

ప్రభునియాజ్ఞ నిర్వర్తించుట సేవకుల విధియై యున్నది. అంతటఁ జోరులు నరపశువును వెదకఁ బలువురు బలుదిక్కులకు బోయిరి. కాని యొక్కనికిఁగూడ నెవరును లభింపలేదు. నిరాశచే మగిడి వచ్చిరి. అంతటితోఁ దమ పట్టుదలను వదలక యెండనక వాననక రాత్రింబవళ్లు తిరుగుచుండిరి. ఎచ్చటనుగూడ నొంటరిగా మనుష్యుఁడు కాన్పింపలేదు. చోరుల భయముననే ప్రజ లొంటిమై తిరుగుటలేదు. వారలుపడు కష్టములకు మితియే లేదు. భరతుని సోదరులు వానిని పశుపక్ష్యాది మృగముల బారినుండి సస్యమును కాపాడుటకై క్షేత్రమునకు బంపియుండిరి. పరమ భక్తాగ్రేసరుఁ డగు భరతుండు పద్మాసనమువైచికొని క్షేత్రమునొద్ద భగవంతు నారాధించుచుండెను. అట్టిసమయమున చోరులు వానినిం జూచి తమకార్యము నెరవేరిన దని సంతోషించి, యగ్నిం జేరు శలభంబులభంగి వానిం జేరి పైఁబడి బంధించి తమ నాయకునియొద్దకు దీసికొనిపోయిరి. బలి నొసంగుటకు యువకుఁడును, దృఢకాయుఁడు నగు నరుఁడు దొరికెనని ప్రమో

దాంతరంగులైరి. వారలు తన్నేమి జేయుచుండినను భరతుఁడు మాట్లాడి యెఱుంగఁడు.

ఆ చోరులు బలి సమర్పించుట కొకదినము నిశ్చయించిరి. వారు ఆ గడువువఱ కాతని కన్నపానాదు లొసంగుచు మిక్కిలి ప్రేమతోఁ జూచుచుండిరి. నిర్దిష్టదినము వచ్చెను. ఆ దినమంతయు వా రాతని నలంకరించుటయందే గడపిరి. అభ్యంగనస్నానముఁ జేయించి నూతన వస్త్రములం గట్టి పెట్టిరి. శరీరమంతయు చందనం బలఁది పూలదండల చే మెడ నలంకరించిరి. అమ్మవారికిఁ బ్రీతి యగు వేపరొట్టం గూడఁ గట్టిరి. ఇట్లా నరపశువు నలంకరించి యానందమున మైమఱచి త్రాగి గంతులిడఁ జొచ్చిరి. తాము కాళి వాగ్దానమును నెరవేర్చుచున్నామను సంతోషముగాక మ రేమియు వారికిఁ దెలియుటలేదు. ఇనుఁడు పశ్చిమాంబుధిం గ్రుంకెను. పద్మినియు నాథుని దుస్సహావియోగముచే నేత్రారవిందంబు లల్లనల్లన మూయఁ దొడంగెను. తారకా నికాయంబు పొంకమై చూపట్టెను. పక్షులు తమ గూండ్లకుఁ జేరెను. కటికిచీఁకటి బ్రహ్మాండం బంతయు నిండెను. జారచోరాదులు తమ కార్యములను నిరాటంకముగఁ జేసికొనుటకు సహాయపడెను. అట్టి గాఢాంధకారమున భరతునిఁ దోడ్కొని చోరనాయకుఁడు సపరివారంబుగా బయలుదేరెను. భీకరాకారమున నున్న రాత్రియందు వారల నాటంకపఱచువా రేరి? కావున వారు స్వేచ్ఛగ కాళీమందిరమునకుఁ బోగలిగిరి.

ఆలయము చక్కఁగ శుభ్రపఱిచి బహుసుందరముగ నలంకరించిరి. ఆ యజ్ఞపశువు నందుఁ బ్రవేశపెట్టిరి. వృష

రాజు పురోహితుఁడు చేయవలసిన స్తోత్రంబులు చేసి మృదంగాదులను ప్రయోగించి భరతుని కాళియెదుటఁ గూర్చుండ నియోగించి పూజింపఁ జొచ్చెను. తదనంతరం బా యర్చకుఁడు ఖడ్గంబుఁ జేఁబూని చంప నుంకించుచుండెను. అమ్మహాపురుషుఁ డగు భరతుఁడు బాహ్యప్రచార మేమియు నెఱుఁగఁడు. ఆ దొంగలు రజస్తమోగుణములచే నంధులై బ్రహ్మజ్ఞానసంపన్నుఁ డగువానిని జంపఁ దలంచుచుండిరి. అతఁడు తన్ను విడువు మనిగాని తన కోర్కెలఁ దీర్పుమని గాని యడిగి యెఱుంగఁడు. శీతోష్ణాదులు, సుఖదుఃఖాదులు సమానముగ నెంచిన జీవికి వానితో నేమియు సంబంధము లేదు. పరమాత్మ సామ్యమునుఁ బొందిన, యా విప్రకుమారు సంహారము దారుణకర్మముగా నెంచి భద్రకాళి సహించి యుండలేకపోయెను. వాని ధైర్యమునకు కాళి గజగజ వణకఁ జొచ్చెను. ఆ బ్రహ్మతేజస్సు సమక్షమున కాళి భీతిల్లెను. ఆమె విగ్రహమునుండి బహిర్గతయై తన కాయం బును బెంచి కోపముచే వారలపైఁబడెను. అర్చకుని యొద్ద నున్న ఖడ్గంబుఁ గైకొని యా పాపిష్ఠుల నందరిని ఖండించి వారల రుధిరంబులం గ్రోలెను.

అట్లా ఖలు లందరు మడిసిన తరువాత భరతుఁడు కాళీమందిరము వెలువడి తనదారిం దాను వోయెను. ఆ సమ యమునఁ గాళి యాతీరునఁ జేయనిచో నపరాధ మామెదే యగును. భరతుఁ డా చోరులపైనను గినుక పూనలేదు. మహాత్ములగువారు తమ శిరములను భేదింపనున్న వానిపై సహితము క్రోధము వహింపరు.

భరతుని నిజస్వరూపమును దెలియఁజేయు మఱి యొక యితిహాసము కలదు. సింధు సౌవీర దేశములకు రాజగు రహూగణుండు ప్రపంచ భోగభాగ్యములయందు విసుగు జనింప తత్త్వజ్ఞానోపదేశమును బడయుటకు రాజ్యంబు వీడి కపిల మహాముని యాశ్రమమునకు శిబికపైఁ బోవుచుండెను. కొంత దవ్వరిగి శిబికావాహకు లలసి దాని నచ్చట దింపి విశ్రాంతి గైకొనుచుండిరి. ఆ విశ్వంభరా భరణుం డతి శీఘ్రముగఁ బోవనెంచి మఱియొక వాహకునిఁ దోడ్కొనిరమ్మని పంపెను. సేవకుఁ డాజ్ఞానువర్తియై బోవు చుండ మార్గంబున భరతుండు గోచరంబయ్యెను. ఒడ్డుపొడు వులం గలిగియున్న భరతుని జూచి యాతఁడు శిబికను మోయఁ గడు సమర్థుఁ డనుకొని బలవంతముగఁ దీసికొని పోయి శిబికను మోయ నియమించెను. భరతుఁడు మూగ వానివలె తదితర వాహకులతో మోయుచుండెను. అతని కట్టి పనియం దభ్యాసము లేమిచే వాహకుల గమనము కుటిలత్వము వహించెను. రహూగణుం డది గమనించి యుద్ధానికి కారణం బడిగెను. ధరణీపాలుండు తమను దండిం చునేమో యని భయపడి గమనకుటిలత్వమునకు కారణ మా నూతన పురుషుం డని విన్నవింప దొడఁగిరి. ఈ విధమున వానితోఁ గలిసి మోయజాలమని ప్రార్థించిరి. వాహకులలో నొక్కండు విషమముగ నడచినను వాహనగతి విషమముగ నుండునని రాజు గ్రహించెను.

తత్త్వజ్ఞానోపదేశమునకై పోవుచున్నను, రా జింకను మనస్సు స్వాధీనపరచుకొనలేదు. 'నివురుగప్పిన నిప్పు'వలె

నున్న యా బ్రహ్మతేజోమూర్తి నుద్దేశించి యిట్లనియెను. "ఓయీ! నీవు చాల దవ్వు మోయుటచేతనుగాబోలిప్పు డిట్లు వక్రగతిని నడచుచున్నాఁడవు. పాప మలసినట్లుఁ గన్పట్టుచున్నాఁడవు. ముదుసలి వగుటవలన వారలతో సమముగ నడువజాలకున్నాఁడవు." అని సాక్షేపముగఁ బలికెను. చెవిటివాని ముందు శంఖమూదిన ట్లహంకారములు వీడిన భరతుఁడు వాని మాటలను బాటింపక తొంటియట్ల పల్లకీ మోయఁజొచ్చెను. ఇంకను శిబికాగమనము విషమముగనే యుండుటచే మహీపతి మఱింత మండిపడుచుండెను. రజస్తమోగుణములు ప్రధానముగాఁ గలవాని మన స్సెట్లు శాంతియుతముగ నుండును? "ఓరీ, తులువా! నీవు జీవచ్ఛవమువలె కాన్పించుచున్నావు. నే నీ ధరాతలంబున కధిపతిని. నా యాజ్ఞనతిక్రమించుచు ప్రమత్తుండవై చరించుచున్నాఁడవు. నే నొక యల్పుఁడను గాను. నీ యపరాధమును క్షమింప" నని కోపముతోఁ బలుకఁజొచ్చెను. రజస్తమోగుణయుతుల నడవడి మఱెట్లుండును? వారలు తామే పండితుల మనుకొనెదరు.

భరతుఁడు రహూగణున కిట్లు ప్రత్యుత్తరమిచ్చెను. "నీవు పలికిన పలుకులం దేమాత్రమును సత్యము గానుపింపదు. అవి ధర్మవిరుద్ధములు. 'నీవు మిక్కిలి బలసి యున్నాఁడ'వని పలికితివి. అది పంచభూత సముదాయముచే కలిగిన దేహమందుండిన నుండవచ్చును. కాని నాయందు లేశమేనియు గానరాదు. ఆత్మ నిజరూప మెఱింగినవా రిట్లు పలుకరు. జరామరణాదులు శరీరమునకుంగాని యాత్మకుకావు. 'ప్రభు

వగు నా శాసనము ధిక్కరించుచున్నాఁడ' వంటివి. అధి కార మెవ్వనియందుఁ గలదో వాఁడు శాసింప నర్హుండు. అట్టిది మానవునియందు లేదు. పరమేశ్వరున కొక్కనికే యధికారము గలదు. ఆతని కనుసన్నలచే జీవులు చరించు చుండును. కాలవశమున నీకు రాజ్యభ్రష్టత్వము కలిగినచో శాసింప నధికారము నీకుఁ గలదా ? ఇదంతయు భ్రాంతి. 'ప్రమత్తుండవగు నిన్ను దండించెద' నంటివే. ద్వంద్వ ములయందు సమానదృష్టిగల నన్ను నీదండనము లేమియుం జేయఁజాలవు."

ఇట్లమ్మహీపాలుండు సకల పురాణేతిహాసంబులఁగల సారాంశమునుఁ దెలియఁజెప్పిన శిబికావాహకునిం జూచి యతండు సామాన్యమనుష్యుండు గాఁ డని తలఁచి వెంటనే శిబికనుండి దిగి దండప్రణామంబుఁ జేసి తన తప్పును సైరింపు మని ప్రార్థించెను. "ఓ మహాత్మా ! నీవు బ్రహ్మవర్చస్సుగప్పిన బ్రాహ్మణునివలె గన్పట్టుచున్నాఁడవు. అజ్ఞానముచే నీ మనస్సు తెలిసికొననైతిని. నీ వెవ్వరవు ? మాయా రూపం బున వచ్చిన కపిలమహామునివా ? అట్లయినచో నే వెదకఁ బోయిన నోషధి దైవయోగంబున కాళ్ళం దగిలె" నని విన్నవింప భరతుండు వాని కోరికపై సమస్త ధర్మంబులు సెప్పి వానిని గృతార్థునిఁ జేసెను.

తదనంతరంబు రహూగణుండు పరమాత్మ చింతనా నిమగ్నుఁ డాయెను. భరతుం డిట్లు కొంతకాలము గడిపి కర్మరాహిత్యము కాఁగా భౌతికశరీరమును వీడి పరలోకం బునకుం జనియెను.

# 3. దక్షప్రజాపతి

ధరణీసురుం డగు దక్షప్రజాపతికి బ్రసూతిసతియందుఁ బదియార్వురు కన్యక లుద్భవించిరి. అందుఁ బదుమువ్వురను ధర్మరాజునకును, నొక్కతెను హుతాశనునకును, మఱొక్కతెను బితృదేవతలకును, నింకొక తెను జన్మమరణాదిరహితుం డగు నభవునకుం బెండ్లిసేసెను. ఈశ్వరునిం బెండ్లియాడినది సతీదేవి. ఈమె దక్షుని కడసారి దుహిత. సతీదేవి శంకరుని ననవరతము కొలిచి యాతని మన్ననలకుఁ బాత్రయయ్యెను.

పూర్వము ప్రజాపతులు సత్రయాగము చేయఁ బ్రారంభించిరి. ఆ యాగమునకు సమస్తదేవగణంబులు విచ్చేసి యథావిధిఁ దమస్థానంబు లలంకరించిరి. అమ్మఖమున కసమానదివ్యతేజోమయుఁ డగు దక్షప్రజాపతియు, నరుదెంచిన సమస్తదేవనికాయంబును సగౌరవముగఁ దమ తమస్థానంబుల నిలిచి మర్యాద లొసంగిరి. బ్రహ్మయు, నీశ్వరుండును లేవరైరి. అంత దక్షుండు గురు వగు బ్రహ్మకు నమస్కరించి సభామండపమున కరుదెంచి తన్నుం గని సగౌరవముగ లేవని శంకరునిం జూచి యుగ్రుండై మండిపడి యాతని నిట్లు తూలనాడఁ బ్రారంభించెను. "ఓ సభాసదులారా! నేఁ జెప్పున దంతయు తమ వీనులం జొన్పుడు. లోకపాలకుఁడ నని విఱ్ఱవీఁగుచున్న యీశ్వరుఁడు పాత్రాపాత్రములు తెలియని హీనుఁడు. వీఁడు మదాంధుఁడు. హీనతముఁడు. వీనికి సావిత్రి సమాన యగు నా పుత్రిక నిచ్చి వివాహంబుఁ గావించితిని. హరిణేక్షణ యగు నా సౌందర్య

రాశిని మర్కటలోచనుం డగు నీ వికృతాకృతి కిచ్చి కట్టఁ బెట్టితిని. ఆ సాధ్వీమణి కితఁ డెనయే? నా యల్లుఁ డగు వీఁడు, సత్పురుషులవలె నే వచ్చునప్పుడు లేచి గౌరవింపక మర్యాద తెరుంగని మూర్ఖుఁ డగునా? ఈతఁ డనయము పరిహీణన క్రియలు చేయువాఁడు. స్మశానవాటికఁ జరించువాఁడు. భూత ప్రేత పిశాచను లీతని యనుచరులు. వల్లకాటియందలి భస్మమే మైపూఁతగా మేనంతయు నలముకొనువాఁడు. వీని కంఠమునకు గపాలములే యలంకారములు. ఇతఁడు సిగ్గును విడనాడి దిగంబరుండై తిరుగు ద్విపాదపశువు. ఇట్టివానికి ముద్దులమూటగట్టు మదీయతనయ నిచ్చి పేరుప్రతిష్ఠలం బాపుకొంటిని. ఇఁక నేమనవలయు? శివుఁ డను నామంబు నకుం గూడ నర్హుండుకాఁడు. వీనిని శపించినను బాపంబు లేదు. ఈతం డింద్రాదులతో మఖంబున హావిర్భాగం బునుఁ బొందుచున్నవాఁడు. కాని దుష్ప్రవర్తనం బట్టి తగఁడు. కావున హావిస్సులయందు వీనికి భాగము లేకుండు గాక" యని శపించి తనస్థాన మలంకరించెను.

రుద్రుం డా నిందావాక్యములను స్తుతిపూర్వకముగఁ గైకొనెను. కాని శాపంబువలన హావిర్భోక్తల పంక్తినుండి తాను నిషేధింపఁబడుటచేతఁ బ్రవృద్ధం బైన కోపంబుతో నిజనివాసంబునకుం జనియెను. ఈ యనర్హవాక్యములను వినుచున్న నందికేశ్వరుండు మాత్ర ముగ్రుండై ప్రతిశాప మిచ్చుటకు సంసిద్ధుఁ డాయెను. "ఓ దక్షుఁడా! భగవ దంశసంభూతుం డగు నప్పరమపావను నిందించినందుల కనుభవింపు మిదే శపించుచున్నవాఁడను. నీ వెప్పుడును

పరబ్రహ్మజ్ఞానస్వరూప మెఱుంగక సంసారసుఖంబులం బడి మునిఁగెదవుగాక. మఱియు నీవు మేషముఖుండ వయ్యెదవు గాక" యని శపించెను. నందికేశ్వరుం డంతటితో శాంతి బొందక దక్షుని నిందావాక్యములను మిక్కిలి యాసక్తితో వినిన బ్రాహ్మణులం గూడ శపించెను. దానికి భృగుండు కోపారుణితలోచనుండై "కేవల మెవ్వఁడు రుద్రుని నారాధించెదరో వారు వేదవిరుద్ధకర్మము లాచరించు పాషండు లగుదురు గాక" అని శైవుల శపించెను. తచ్ఛాప ప్రాప్తికి నంది చెదిరిన హృదయము గలవాఁ డయ్యెను. ఋషులు హరిప్రీతికై సహస్ర సంవత్సరములు సత్రయాగ మును నిర్వర్తించి యథోచిత సత్కారములం బొంది తమ నివాసంబులకుం బోయిరి.

దక్షునకును నీశ్వరునకును దినదినాభివృద్ధిగ విరోధము ప్రబలసాగెను. పెక్కు వత్సరములు గడచెను. బ్రహ్మవలన సకల మగు ప్రాజాపత్యము దక్షునకుఁ జేకూరెను. ఆతఁ డారాజ్యమదంబునఁ గన్నుఁగానక చరించుచుండెను. అరుద్రకముగ వాజపేయంబులఁ గావించి బృహస్పతి సహాయమున నాతఁడు సవననామకంబైన మఖంబుఁ జేయఁ బ్రారంభించెను. ఆ యజ్ఞంబునకు శివునకుఁ దక్క తక్కిన చతుర్దశభువనోత్తమదారిత్రులకుఁ బురోహితగణంబుల వలన సవనాహూతిఁ బనిచెను. ఆహ్వానము లందుకొని సురమునినికాయంబు లుదారసహితముగ విచ్చేసెను. వార లకు దక్షుండు విశ్వకర్మచే నిర్మింపఁబడిన భవనములు విడుదు లుగా నొసంగి యథోచితసత్కారములు గావించి ముద

మంద( జేసెను. దక్షుఁడు రుద్రు నవమానపఱచు నుద్దేశ ముతో నతనిఁ బిలువకుండెను. దధీచి యను మహాముని దక్షునిఁ జేరంజీరి యిట్లనియె. "ఓ రాజా! యెవ్వనివలన సమస్త మంగళములు సిద్ధించునో యట్టి పురాణపురుషుం డగు సదాశివుఁడు లేనిచో నీ యాగము శోభాయమానముగ నుండదు. చంద్రశూన్యం బైన రాత్రి శోభింపదు. కావున సురశ్రేష్ఠులతో గంధమాదనంబునకుఁ బోయి యాతనిఁ దోడ్కొని రమ్ము" అని చెప్పిన నమ్మునిమాటలు పాటింపక తిరిగి యీశ్వరుని దూషింపఁ దొడఁగెను. తత్కారణమున దధీచి సభనుండి లేచి దక్షుని శపించి యందుండి వెడలి పోయెను.

తండ్రిమఖంబుజాడ కుమార్తెయైన సతికిఁ దెలియ వచ్చెను. ఆ యాగంబునుఁ జూడ పరులే పరువులిడుచుండ సతీదేవిమనం బెట్లుండునో యాలోచింపుఁడు? స్త్రీలకు పుట్టినిండ్లపై గాఢ మగు ననురాగము. ఆమె యా యజ్ఞం బునుఁ జూడఁ గుతూహలాయత్తచిత్తయై యీశ్వరుం జేరం జని మృదుమధురవాక్కులతో నిట్లనియెను: "ఓ ప్రియ వల్లభా! నా జనకుం డగు దక్షుండు సవనంబు గావించుచున్న వాఁడు. అద్దానిం జూచుటకు దేవతలు భార్యాసహితులై పోవుచున్నవారు. నాకును దమతోఁ బోవ నిచ్చఁ బొడము చున్నది. మన బంధువు లందఱు వచ్చియుందురు. వారలం జూడవలయునని కుతూహలము గలుగుచున్నది. పరస్పరము వచ్చుచు బోవుచుండుటయే గదా బంధుధర్మము. కావున నాతో యజ్ఞవాటిక నలంకరింపుఁడు. ప్రపంచ స్వరూపు లగు

మీ కాశ్చర్య మనునది లేదు. కాని నాబోటి తత్త్వహీను రాలికిఁ బ్రపంచమునందలి యేకృత్యములైన నాశ్చర్యము గలిగించును. పిలువని పేరంటమున కేల పోవలయు నందు రేని చెప్పెద వినుఁడు. పితృ, మిత్ర, గురు, భర్తృ గృహంబుల కాహ్వానింపబడకయే పోవచ్చు నని మనీషులు చెప్పు వాక్యములు మీకుఁ బ్రోత్తలా ? మఱియు నధర్మమార్గగతుం డగు దక్షుని శాంతవచనముల బుద్ధిగఱపి పశ్చాత్తప్తునిఁ జేయు భారము సన్నిహితబంధువుల మగు మనకుఁ గలదుఁ గదా ? కావున నా విన్నపం బాలకించి మఖంబునకు వేగంబె పయనంబు గం"డని ప్రార్థించిన నాతఁడు సహేతుకంబుగ నిట్లనియె.

"ఓ సాధ్వీ ! నీ వనినదానియం దసత్య మేమియు లేదు. బంధు తా గౌరవము చెడనినాడు బంధువు లనాహూతులై బంధువులిండ్లకుఁ బోవుట సర్వసమ్మతము. కాని వారు పరస్పర విరోధములచే దహింపబడుచున్నప్పు డది యసంగతము. విద్యాతపోవిత్తవయోరూపకులములు సజ్జనులకు గుణంబులు. ఇవి యన్నియుం గలిగియు నీ తండ్రి దుష్టుఁడై యున్నవాఁడు. చిన్న పెద్దల తారతమ్యము లెఱుంగఁడు. అధికులను సహితము దృణప్రాయముగ నెంచును. అట్టి గుణహీనునివాకిట నే నె ట్లడుకిడుదు ? ఇవి యన్నియుఁ బాటింపక వెళ్ళినచో నాతం డవమానము సేయక మానఁడు. బంధుజనులచే నవమాన మొందుటకంటె శత్రువులం జయింపనేరక రణరంగమునుండి పాఱివచ్చిపడిన యవమానము వేయిరెట్లు మేలు. భవత్పితృకరిష్యమాణ మగునది

ములుకులకంటె నెక్కుడు బాధించును. నే నచ్చటి కెట్లు రాఁగలుగుదును ? ఇఁక నీ సంగతి. దక్షప్రజాపతికి నీవనుంగు బిడ్డవు కావచ్చును. దానంజేసి నీపైఁ బ్రేమ యుండుట సహజమే. తనయలయందరలోను నిన్ను మిక్కిలి యాదరముగఁ బెంచినఁ బెంపవచ్చును. కాని నీవు నా భార్యవగుటంజేసి నిన్ను ననాదరముగఁ జూచును. పూజనీయుం డగు దక్షుని నేల తిరస్కరింతునందువా ? చెప్పెద వినుము. ఆతఁడు సభకు వచ్చునెడ నేను నిలువఁబడి గౌరవింప లేదు. అది వానినిఁ గుపితునిఁ జేసినది. జ్ఞాని పరమపురుషునకు నమస్కరింపవలయును. అజ్ఞాని దేహాభిమానికి నమస్కరించును. అందుచే దక్షప్రజాపతి దేహమునందున్న పరమపురుషునికి నేను నమస్కరించితిని. అది వానికిఁ దెలియదు. కావున నట్టి యజ్ఞానితో మన కేల ? నీవు పోయినచో నవమానము తప్పదు. బంధుకృతావమానముకంటెఁ జావు మేలు. నే నచ్చటికి రాఁజాలను. నీవు పోయినఁ బోవచ్చును. నా యభ్యంతర మేమియు లేదు. తరువాత నీ యిష్ట"మని యీశ్వరుండు పలికెను.

ఆమె పుట్టినింటికిఁ బోవుట ఫణిభూషణుని కిష్టము లేదయ్యెను. స్త్రీచాపల్యంబున దాక్షాయణి యజ్ఞమును జూచుట కుత్సాహముగ నుండెను. భర్త చెప్పినట్లు తండ్రిచే నవమానింపబడినచో భర్త మొగము చూచు టెట్లు ? ఇట్లామె మనస్సు రెండువంకలకుం గూడ లాగఁజొచ్చెను. చలించుచున్న మనస్సును దిట్టపఱచుకొని పుట్టినింటికిఁ బోవ దృఢపఱ్చుకొని తనకోర్కె నెఱవేర్చనందులకు రుద్రునిపై కోపించి

కాలినడకం బోవుచుండెను. అది రుద్రానుచరులు గాంచి దివ్యభూషణమ్ములచే నలంకరించి పరిమళద్రవ్యంబుల నొసంగి వృషభవాహనారూఢం జేసి రుద్రాణిం గొల్చుచుం బోయిరి. సతీదేవి యతిశీఘ్రుంబున దక్షయజ్ఞ వాటికను బ్రవేశించి వాహనావరోహణంబుం గావించి తన గణంబుల నచ్చటనుండ నియమించి లోనికిం బోయెను. దక్షుని భయమువలన నెవ్వరును నామె నాదరింపరైరి. తండ్రి యామెను గ్రీగంటనైనను జూడలేదు. తల్లియు సోదరీమణులు మాత్ర మామెను నిగాఢ మగు ప్రేమచే గాఢాలింగన ములు గావించిరి. కాని యామె వారిపూజల నేమియు స్వీకరింపలేదు. దక్షుఁడు తనకుఁ జేసిన యవమానమునుఁ దలఁచుచుండెను. భర్తపలికిన పలుకులయందలి సత్యమును గ్రహించెను. గర్వాంధుఁ డగు దక్షునికి బుద్ధి చెప్పవలయు నని సంకల్పించెను. రోషానలంబుచే దహింపఁబడి దక్షునితో నిట్లనియె.

"ఓ జనకా! నీవు లోకప్రియుం డగు నాభర్త నవమాన పఱచుచున్నావు. నీవంటివారు పరునియందు దుర్గుణము లాపాదింతురు. కొందఱు పరులయందు దుర్గుణముల మాత్రమే యెన్నుదురు. మఱికొందఱు పరుల దుర్గుణంబులు సహితము దోషంబులుగా నాపాదింపరు. ఉత్తమోత్తములు దోషంబులు సహితము సద్గుణములుగా గ్రహింతురు. అట్టి మహాత్మునియందు నీవు బాపబుద్ధిగలిగి వర్తించుచున్నావు. అతని నామాక్షరము లుచ్చరించినమాత్రమున సమస్త పాపములు పోవును. అట్టి మంగళస్వరూపుని నీవు ద్వేషించు

టాశ్చర్యజనకంబు. మహాత్ము లాతనిం గని బ్రహ్మానందము నొందుదురు. అతఁడు పూజించువారలకు గోర్కెల నొసంగు కామధేనువు. అట్టివానిని ఫణిభూషణుం డనియు, భస్మధారి యనియు, భూతపిశాచానుచరుఁ డనియు బలుకుట నీకుగాని మఱి యన్యుల కొప్పదు. బ్రహ్మాదిసురు లమ్మహాత్ముని సచ్చరణ సరోజ పరాగ రేణువులం దమ శిరంబులందు దాల్తురు. అమ్మహానుభావుని నిందించువాని నాల్క నీ సభా సదులు శతధా వ్రక్కలు సేయవలయును. తా మట్టి పని గావింప లేకున్న చో నట్టి నిందావాక్యములు దమ చెవులఁ జొరకుండనైన యత్నింపవలయును. విని యూరకుండుట కంటె జనిపోవుట మేలు. అట్టి నీచుఁడ వగు నిన్ను నా తండ్రి యనుటకే నాకు సిగ్గగుచున్నది. నీచే నవమానితనై జీవిం చుటకంటె జ్వాలన్మఖాన భస్మసాత్కృత నగుట మే"లని నుడివి సతీదేవి యుత్తరదిక్కు మొగంబై మనస్సు నిరోధించి యోగాగ్నిం బుట్టించి భర్తృపాదకమలధ్యానయై యావహ్నిం బడి భస్మీభూత యయ్యెను.

దక్షునితో వైరంబుకతన నన్నలినాక్షి ప్రాణంబు విడచె నని సభాసదు లందఱు చెప్పుకొనుచుండిరి. దక్షుని దౌర్జన్యదౌర్భాగ్యములు దలంచిరి. ఈ భీభత్సమంతయుఁ గాంచి భయభ్రాంతులైరి. తమరాణిం గొలిచి వచ్చిన రుద్రానుచరులు దాక్షాయణి మరణంబునకు మిక్కిలి జింతించుచు యజ్ఞంబు ధ్వంసంబుఁ జేసి వారలనుఁ జంపుటకై యాయుధసన్నద్ధులైరి. ఊరకుండినచో ముప్పు వాటిల్లు నని భృగుమహర్షి తలంచి వారలను వారించుటకై దక్షి

ణాగ్నియం దాభిచారకహోమము గావింప సహస్రసంఖ్యాక ఋషభనామధేయ లుదయించి వారలపైఁబడి మర్దించి యజ్ఞంబు గాపాడిరి.

దాక్షాయణిసహితంబుగ రుద్రానుచరులు మడి యుట నారదునిమూలంబున నెఱింగి రుద్రుండు రౌద్రాకారంబుఁ దాల్చెను. క్రోధాగ్ని ప్రజ్వరిల్లుచుండెను. ఆయగ్నిజ్వాలలనుండి నూరు జ్వరంబులును, పదుమూఁడు సన్నిపాతములును జనించెను. మఱియు ధూర్జటి తనజటాజూటమునుండి యొకజటఁ దీసి భూభాగంబున బిట్టుగఁ గొట్టెను. అత్తాడనంబునఁ ద్రినేత్రుండును, సహస్రబాహుండును, నతిభయంకరా కారుండును, నీలమేఘచ్ఛాయ దేహుండును, భాస్కరతేజుండును నగు వీరభద్రుఁ డుదయించెను. అమ్మహావీరుండు భయవినయములు చూపించుచు దండప్రణామంబు లాచరించి తానొనరించు కార్య మెద్దియో యెఱుఁగం బల్కుఁడని శంకరుని వేడుకొనెను. అంత మహేశ్వరుండు వీరభద్రుని బ్రమథగణంబు లంతటికి నాయకుని గావించి “వీరభద్రా! నీ వతి త్వరితంబుగఁ బోయి మమ్మవమానించిన దుర్మదాంధుఁ డగు దక్షునియధ్వరంబు ధ్వంసంబుఁ గావింపుము. నీ కెందును నపజయ ముండదు పొమ్ము” అని దీవించి పనిచిన నాతఁడు జనకునకుఁ బ్రదక్షిణంబు గావించి తన సైన్యముతో బయలుదేరెను. భూతప్రేతపిశాచంబులు శూలంబులు గేలఁగీలించి భూనభోంతరాళంబులు ప్రతిధ్వనులీన సింహనాదంబు గావించుచు నాతని వెంటాడుచుండెను. అమ్మహాసైన్యము సముద్రమువలెఁ గనఁబడెను.

వారలు పోవునెడ దత్పాదఘట్టనముల రేగి కెంధూళి పటలము మార్తాండమండలంబును గప్పుచుండెను. ఆ ధూళిం గాంచి దక్షునిసభలోఁ బలువురు పలువిధములఁ జెప్పఁగొనం దొడంగిరి. అది వాయువువలన నెగురగొట్టఁ బడిన ధూళి యని కొంద ఱనిరి. చోరాదుల వలన కలిగి యుండవచ్చు నని మఱి కొంద ఱనుకొనిరి. గోగణములధూళి యని కొందఱ మత మయ్యెను. దక్షుఁడు క్రూరచిత్తుఁడై ప్రియకుమారికను జంపెను. అది యాపాపవిపాక మని భూసుర కాంత లను కొనిరి. మహామహిముం డగు శివుని ప్రభావ మని మఱి కొందఱు తలంచుచుండిరి. ఇట్లు దానిని గుఱించి యభిప్రాయములు భిన్నభిన్నములుగా నుండెను. ఆ ధూళి యంతకంతకు సమీపించుచుండెను. సభాసదు లందఱు భయభ్రాంతులైరి. దక్షునకు దుర్నిమిత్తములు గాన్పించుచుండెను. ఎడమకన్నదరఁ జొచ్చెను. కొంతతడవున కంతయు విశదమయ్యెను.

రుద్రానుచరులు భయంకరాకారములతో వికృతాట్టహాసములతో యాగవాటికం బ్రవేశించిరి. వారలఁ జూచి సభాసదులెల్ల భయకంపితచిత్తులై ప్రాణములఁ దక్కించుకొనుటకుఁ బారిపోవుచుండిరి. అంతట వీరభద్రాదులు ప్రాగ్వంశంబును భగ్నము గావించిరి. కొందఱు హోమగుండంబున మూత్రపురీషాదులు దిగవిడచిరి. యజ్ఞశాలలను విఱుగఁగొట్టిరి. పారిపోవుచున్న జనంబులం బట్టి బాధింపఁ దొడఁగిరి. మునిపత్నుల భయ పెట్టిరి. దక్షుని వీరభద్రుఁడును, భృగుని మణిమంతుండునుఁ బట్టిరి. దక్షుఁడు శివుని నిందించు సమయమునఁ దమ యామోదములను దెలిపిన ప్రతి వ్యక్తి

నేదో యొకరీతి శిక్షఁ గావించిరి. కొందఱఁ గాలం జమరిరి. భృగుమహామునిశ్మశ్రువు లూడఁబెఱికిరి. వీరభద్రుఁ డెంత కఠినముగ శిక్షించినను దక్షుఁడు చావకుండుటఁ గాంచి యజ్ఞపశువును జంపు విధమున కంఠము నులిపెట్టి వానిం జంపెను. అంతటితోఁ దృప్తిఁజెందక శరీరంబునుండి శిరస్సు వేరుచేసి దక్షిణాగ్నియందు హోమముఁ జేసెను. ఇవ్విధం బున నయ్యజ్ఞవాటికను విహరించి భీభత్స మొనర్చెను. ఆతని కెదురాడువారు కానరారైరి. వీరభద్రుఁడు తన సైన్యంబుఁ జేసిన కార్యములకు మిక్కిలి సంతసించెను. బ్రాహ్మణులు వారలను శపింప మొదలిడిరి. వీరభద్రుం డంతటితోఁ దృప్తిఁ బొంది మనస్సును శాంతపఱచుకొని సేనాసమేతుఁడై విజయభేరులు మ్రోయ శంకరదర్శనార్థ మేతెంచెను.

వీరభద్రాదులచేఁ బరాభవము నొందిన దేవతలు బ్రహ్మపాలికిం జని స్వపుత్రఘాతంబును, యజ్ఞవిధ్వంసనం బును సవిస్తరముగఁ జెప్పిరి. ఇట్లు జరుగు నని బ్రహ్మయు విష్ణుండును మున్నె యెఱింగియుండుటచే దక్షాధ్వరంబునకుఁ దాము పోకుండిరి. హతశేషు లగు సురల మొర బ్రహ్మ యాలకించి వారలతో నిట్లనియె "సురలారా! మీరు కండ కావరమున మహామహుం డగు శివున కపరాధముఁ గావించి తిరి. హితముఁ గోరు సత్పురుషు లెవ్వ రట్టి కార్యములు చేయుదురు ? యజ్ఞపురుషుం డగు నీ యీశ్వరునికి యజ్ఞభా గంబు లేకుండఁ జేసియుంటిరి. ఇయ్యది బుద్ధిమంతుల లక్షణమా? ఆతని శాంతపఱచువార లెవ్వరును లేరు. మీరు

మిక్కిలి పాపులు. ఆతఁడు కోపించిన సర్వతోముఖముగ సర్వలోకములు క్షణమున భస్మీభూతము లగును. అట్టివానికి రౌద్రము రాకుండఁ గాపాడుకొనవలయును. మీరలేపోయి తత్పాదపద్మములం బడి క్షమింపుఁ డని కోరుఁడు. నేనును వానికి భయపడుచుందును. అట్టివానిని దక్షుఁడు తూలనాడి మిక్కిలి యపచార మొనర్చియున్నాఁడు. దీనికిందోడు దాక్షాయణికి మరణంబునుఁ గూడఁ గల్పించి యున్నాఁడు. ఇట్టి హేతువులవలన నీశానుండు సులభసాధ్యుఁడు గాఁడు. ఆతని యంతరంగమును దెలిసికొన మునులకుం గూడ వశముఁగాదు. అట్టియెడ మీబోటివారలసంగతి వేఱ చెప్పవలయునా? కావున మీరలు వైళంబ పయనించి శంకరునిఁ బ్రార్థించి ప్రసన్నతాకలితునిఁ జేసికొనుఁడు. నేను మీతోవచ్చి పరమేశ్వరునిం బ్రార్థించెదను. అమ్మహాను భావునికిఁ గృపగలిగినచో మన మందఱము రక్షింపఁ బడుదుము."

దేవదేవుని సందర్శించి తదనుగ్రహంబును బడయు టకై బ్రహ్మ హంసవాహనారూఢుఁడై సకలదేవతానికరంబు దనవెంటరా కైలాసంబునకుఁ బోవుచుండెను. దేవతలు తన్మార్గంబునఁ బోవుచుఁ జిత్రవిచిత్ర మగు వస్తుజాలంబునుఁ జూచుచుండిరి. కొన్నిదినంబులు పోయిపోయి యెట్టకేలకుఁ గైలాసంబుం జేరిరి.

అది దేవత్వమునుఁ బొందిన మహాత్ములచేతను, సిద్ధులచేతను, గిన్నరగంధర్వాదులచేతను సేవింపఁబడు చుండెను. అచ్చటివారలు విభూతిచేఁ దమ శరీరంబు లలంక

రించుకొని శివపంచాక్షరీమంత్రముఖరితముఖులై విలసిల్లు చుండిరి. రుద్రాక్షమాలికాభూషణవిరాజితులై రాజిల్లు చుండిరి. అగ్గిరి పరిమళమిళత్కుసుమలతలతోను, చిత్ర విచిత్రము లగు రత్నంబులతోను, సమస్తవిధమృగసమూహ ములతోను, ఫలభరితము లగు తరుషండములతోను, జూపఱు కన్నుల కింపు నింపుచుండెను. తుమ్మెదల ఝుంకారమును, పికకంఠ మధుర హుంకారమును జెవుల కింపుగొలుపు చుండెను. అందు సిద్ధసీమంతినులు ప్రియులతో విహ రించుచుండిరి. ఆ పర్వతము గంగానదిచేఁ బవిత్రముఁ గావింపఁబడుచుండెను. ఇవన్నియుం గడిచి లోకప్రఖ్యాత మగు నలకాపురిం జూచిరి. ఆ పురంబు వెలుపల రెండు సెలయేరులు ప్రవహించుచుండెను. ఆ పావనజలంబుల దేవతలు తమ ప్రియతమలతో విచ్చేసి జలక్రీడలఁ గావించుచుండిరి. వారలశరీరమునందు గల గంధ కుంకుమ కస్తూరీ ప్రముఖ సువాసన ద్రవ్యము లానీటంగరగి తజ్జలముల శబలితద్యుతికలితము లొనర్చి పరిమళింపజేయుచుండెను. ఇట్లు సౌగంధికవనంబును నలకాపురంబును నతిక్రమించి కొంత దవ్వరిగి రమణీయ మగు నుద్యానవన మొండు గనిరి. అందు శతయోజన విస్తీర్ణత గల యొక వటవృక్షము గలదు. అందు పక్షు లేమియుం గానరావు. అది మహాయోగనిష్ఠ గల పురుషుల కాధారము. అవ్వటతరుచ్ఛాయఁ బ్రవేశించిన మనస్సు శాంతినొందును. ఈశ్వరునిం గొల్చు నఖిల మునిగ ణంబున కది యాస్థానము. అత్తరుమూలంబున సమస్త సిద్ధావృతుఁడై సమాధియోగమున నున్న మునిశ్రేష్ఠుం డగు

శివునింగాంచి బద్ధాంజలులై ప్రణమిల్లిరి. శివుండు ప్రజాపతిం గాంచి తన యాసనంబునుండి లేచి సవినయముగ నమస్కరించెను. అంత సమస్తశివగణంబును బ్రహ్మకు వందన మాచరించెను. ఈశ్వరుండు ప్రజాపతులం గౌరవించి యుచితాసనములఁ గూర్చుండఁ జేసెను.

అప్పుడు బ్రహ్మ నిజాగమనకారణంబు నివేదింప నిలువంబడి యిట్లు విన్నవించెను. "ఓ యోంకారస్వరూపా! విశ్వబీజుండ వగు నిన్ను నారాయణాంశసంభూతుండ వని యెఱుంగుదుము. చిదానందస్వరూపుండవు. ప్రపంచమునం గల సర్వధర్మములు కాపాడ గల మహాత్ముఁడవు. నిన్ను ప్రేమించువారలకు మంగళము లొసంగుదువు. నిన్ను దూషించువారల నరకకూపంబున ద్రోయఁగలవు. దుష్టుల సహితము సన్మార్గప్రవర్తకుల గావింపఁ గలవు. మాయా మోహితచిత్తులై దక్షాదులు తమకుఁ జేసిన యవజ్ఞతకు వారల శిక్షించి యజ్ఞంబు ధ్వంసంబు గావించితివి. యజ్ఞఫల స్వరూపుండ వగు నీకు యజ్ఞభాగ మీయకుండుట కడుశోచ నీయము. వారల నట్లు శిక్షించుట యుచితమే. ప్రజాపతు లిప్పుడు పశ్చాత్తాపము నొందుచున్నవారలు. కావున దక్షాదుల ననుగ్రహించి సవనంబు పునరుద్ధారణ గావింపుము. మఱియు దక్షానుచరు లందఱు వికలాంగులై యున్నవారు. వారి వారి యవయవముల వారికొసంగి రక్షింపుఁ"డని బహుప్రకారముల బ్రార్థించెను.

"ఓ పితామహా! భవత్పుత్రయజ్ఞంబు నాచే నించుకేనియు భంగము నొందలేదు. స్వయంకృతమహాపరాధం

బులే యీతని నంతవరకుఁ దెచ్చినవి. అయినను నీవు చెప్పిన ప్రకారముఁ జేయుదును. అపరాధుల క్షమించితి. దక్షు శిరంబు యోగాగ్నియందు దగ్ధమైనది. దానం జేసి వానికి మేషముఖం బగు గాక. ఇది నందీశ్వర శాపము. శ్మశ్రు రహితుం డగు భృగుమునీశ్వరునకు మేషశ్మశ్రువులు వచ్చును. వికలాంగు లగు సర్వప్రజాపతినివహంబునకు మగుడ నవ యవము లుద్భవించును గాత" మని యీశ్వరుండు పలికిన సర్వదేవతానివహంబును మిక్కిలి సంతసించెను.

తదనంతరము బ్రహ్మాదులు తన్నుఁ గొలువ రుద్రుండు దక్షాధ్వరప్రదేశంబునకుం బోయెను. పోవునప్పటి కది మిక్కిలి శాంతియుతముగ నుండెను. దక్షుండు నిద్రనుండి మేల్కాంచినవానిభంగి లేచి తన యెదుటనున్న శంకరునిఁ జూచి సిగ్గుపడెను. దక్షున కిదివర కమ్మహాత్ముని యందు గల క్రోధము పటాపంచలైపోయెను. పూర్వ మీశ్వరుని నిందించినందులకు మిక్కిలి పరితపించెను. కడు పునగన్న బిడ్డ యగ్నిం బ్రవేశించుచుండఁ గన్నులార జూడఁగలిగితి నని మిక్కిలి చింతించెను. పొరలి పొరలి వచ్చు చున్న దుఃఖము నాపుకొని శంకరు నిట్లు స్తుతించెను. "ఓ సర్వలోకశరణ్యా! నా యపరాధము క్షమించి మహా పాపస్వరూపుండ నగు నన్ను రక్షించితివి. ఈ స్వపుత్రీకాంత కుని బునర్జీవితుం జేసితివి. భవద్దూషణం బొనరించిన యీ కుటిలస్వభావుని బవిత్రుని గావించితివి. నన్ను దండించి నందులకు సంతసించితిని. నారాయణుండును, నీవును, బ్రహ్మయు దుర్మార్గగాము లగువారల శిక్షించి సన్మార్గ

మునఁ బ్రవేశపెట్టుదురు. ఆవిధముననే దుష్టుండనగు నన్ను శిక్షించి సత్ప్రవర్తకునిగా మార్చితిరి. మావంటివారల నీ దుర్మార్గముననే పోవనిచ్చినచో నధోగతిపాలగుదుము. అట్టి హీనగతిపాలు గాకుండ రక్షించినందులకు విధేయుఁడను. మీరలు గావకుండిన నా నామము పాపభూయిష్ఠమని ప్రజలు తలఁపనేతలఁపరు. మహాత్మా! పరిపూర్ణ పశ్చాత్తప్తుఁడనై మనఃపూర్వకవందనము లాచరించుచున్నాను. మదీయాపరాధంబులు సైరించి తమ దాసానుదాసునిగ ననుగ్రహింపుఁ" డని ప్రార్థించెను. అంత నీశ్వరుండు వాని కిట్లనియె. "దక్షా! నీ వజ్ఞానుండవై సంసారకూపంబునఁ బడితివి. వేదములు దానములు నా కత్యంత ప్రియములు గావు. జిజ్ఞాసార్థము గ్రహించి యాచరించువారలే నా కత్యంతప్రియులు. కావున జ్ఞానపరుండవై యుండు" మని బోధించెను.

తదనంతరము శంకరానుమతిని మగిడి యాగము ప్రారంభించిరి. ఋత్విక్కులు పూర్వప్రకారము వేదమంత్రములు పఠించుచుండిరి. దక్షుండు క్రతువు నిర్వర్తించు చుండెను. పరిపూర్ణభక్తియుతుఁడై నారాయణు నుద్దేశించి హోమముఁ జేయుచుండెను. అంత చిద్విలాసుండును, చిన్మయాకారుండును నగు సర్వేశ్వరుఁడు గరుడవాహనారూఢుఁడై వేంచేసెను. అప్పుడు దేవమునినికాయం బంతయు సగౌరవముగ నిలువఁబడి యజ్ఞపురుషుం డగు నప్పురాణపూరుషుని వేయివిధంబుల స్తోత్రముగావించి యాతని పాదారవిందంబుల కభివందనము లాచరించె. యాగంబు నడుపుచు రుద్రభాగంబును రుద్రున కర్పించిరి. విష్ణుఁడు తన భాగభోక్తయై సంత

సించి కొన్ని ధర్మము లుపదేశించి నిజవాహనారూఢుఁడై వెడలెను.

అనంతరము దక్షుఁడు దేవతల కందఱకు యాగభాగ ముల నర్పించి పూజించెను. వారలు దానినందుకొని దక్షుని కనేక వరంబు లొసఁగి తమతమ నివాసంబుల కరిగిరి. శివుండు తన స్వస్థానం బగు కైలాసంబున కరిగె. లోకపితా మహుండు స్వస్థచిత్తుఁడై పుత్రునాశీర్వదించి హంసవాహనా రూఢుఁడై సత్యలోకమున కేఁగెను.

అప్పటినుండియు దక్షప్రజాపతి యధిక జ్ఞానసంప న్నుండై తపోనిష్ఠాగరిష్ఠుండై సుఖంబున నుండెను.

# 4. బసవేశ్వరుఁడు

పూర్వము శివపాదారవింద ధ్యానము గల నంది యను నొక వైశ్యుండు గలఁడు. అతఁడు వఱువాతన మేల్కాంచి కాల్యకృత్యాదులు తీర్చుకొని సమీప వనంబునకుం జని యచ్చటనున్న శివాలయంబు ప్రవేశించి లింగరూపుం డగు నమ్మహేశ్వరునిఁ బూజించుచుండును. ఆ లింగంబును సకల పరిమళ ద్రవ్యములతో నభిషేకించి వివిధ కుసుమంబులతో నతిభక్తిఁ బూజగావించి నిజగృహంబునకుఁ బోవును. ఇట్లు దినములు గతించుచుండెను.

ఒకానొక దినమున మిక్కిలి క్రూరుండును, బరమ పాపాత్ముండును, నవివేకవంతుండును నగు కిరాతకుఁ డొకం డా వనమునఁ గ్రుమ్మరుచుండెను. ఆతండు వేటతమకంబున డస్సి పిపాసాపీడితుండై యొక సరోవరంబుఁ జొచ్చి నీరంబునుం గ్రోలెను. తరుచ్ఛాయలఁ గొంతతడవు బడలిక దీర్చుకొని పోవ నుద్యమించుచుండ గంధమాల్యాలంకృతం బగు శివాలయం బతని దృష్టిపథమునఁ బడెను.

శివాలయంబుఁ గాంచిన క్షణముననే యాతనియం దొక మార్పు కలిగెను. ఆతని మోము వికసించెను. ఆ మహాకాళుం డాలయంబుఁ బ్రవేశించి లింగేశ్వరునిపై నున్న పూజాద్రవ్యములను తన పాదముతో ద్రోసివేసి గండూష జలంబున నభిషేకించి యొకచేత బిల్వదళంబును మఱియొక చేత మాంసంబును సమర్పించి సాష్టాంగనమస్కారము లాచరించి వెడలిపోయెను.

నంది యథాప్రకారముషఃకాలముననే పోయి శివాలయంబునం గల భీభత్సముఁ జూచి దుఃఖించెను. పరమ పవిత్ర మగు నా ప్రదేశమున మాంసఖండములు చూచి తన సత్కార్యమున కాటంక మని తలఁచి విచారముతోఁ దన గృహమునకుఁ బోయెను. విగతమతి యగు యా వణిక్ శిఖామణి పురోహితుని బిలిపించి వానితో నిట్లనియె: "ఓ విప్రవర్యా! నా కార్యంబున కొంఛు విఘ్నంబు కలిగెను. నేను పరమభక్తితో నొసంగిన పూజాద్రవ్యముల నిటునటుఁ ద్రోసి యే నీచుఁడో యా యాలయంబునఁ బ్రవేశించి మాంస ఖండములచే నంతయు నపవిత్రము గావించెను. దానం జేసి నా వ్రతము చెడెను." నావుడు బ్రాహ్మణుం డిట్లనియె: "ఓ నందీ! నీవు చింతిల్లకుము. 'శ్రేయాంసి బహువిఘ్నాని' యను వాక్యము నెఱుంగవా? సత్కార్యాచరణమునకు విఘ్నములు కలుగుచునే యుండును. ఎల్లి తత్కారణముఁ గనుఁగొని ప్రతీకారం బొనరింతముగాక."

మఱునటిదినమున విప్రసహితంబుగ నంది శివాలయమునొద్దకు వచ్చి దానిని శుద్ధిచేసి ఫలపుష్పంబుల నొసంగి లింగేశ్వరుని స్తుతించుచుండెను. ఇట్లు రెండు యామములు గడచెను. అంతలో ధనుర్బాణధరుండై ప్రళయకాల రుద్రునివలె మహాకాళుండు నిర్భయముగ నాలయము ప్రవేశించి గండూష జలంబున నభిషేకము గావించి బిల్వ దళంబును, మాంసంబును నివేదించి సాష్టాంగనమస్కారము గావించి తనదారిం బోయెను. వారు అక్కిరాతకునిం జూచి చేష్టలు దక్కియుండిరి. భయముచే గడగడ వణకఁజొచ్చిరి.

మహాకాళుండు వెడలిన తరువాత వారలు ప్రతీకార మాలో చించుటకుఁ దమ గ్రామంబునకుఁ బోయిరి.

అంతట నంది వేదవేదాంగపారంగతు లగు విప్రోత్తముల రావించి తగు శుద్ధి సంస్క్రియలు సేయుఁ డని ప్రార్థించెను. అందులకు బ్రాహ్మణు లిట్లనిరి: "వైశ్యశిఖామణీ! నీ కనివార్యం బగు విఘ్నంబు తటస్థించినది. శాస్త్రవిరుద్ధము గాని యొక యుపాయముఁ జెప్పెదుము. నీ వట్లు చేయుము. నీవు పూజించు లింగము విజనం బగు తావున నుండుటచేత విఘ్నంబు వాటిల్లెను. కాన నా లింగంబు నూడఁబెఱికి నీ యింటఁ బ్రతిష్ఠింపుము. అప్పు డేవిఘ్నములు కలుగ"వనిరి. వారి యాలోచనప్రకారము నంది లింగేశ్వరుని తనయింటఁ బ్రతిష్ఠించి పూజించెను.

మఱునాడు మహాకాళుండు యథాపూర్వంబుగ నాలయంబు ప్రవేశించి లింగంబుఁ గానక మిక్కిలి దైన్యంబు నొంది యిట్లు ప్రార్థించెను: "ఓ శంకరా! నీ చరణదాసుండ నగు నన్నేల విడిచిపోతివి? నే నేమి యెగ్గొనరించితి! నా యపరాధమ్ము సైరింపుము. నాకు దర్శనం బొసంగుము. లేదే నిచ్చటనే ప్రాణంబులు విడుతును. నీ దాసుండ నగు నన్నేల కావవు." ఇట్లెంత ప్రార్థించినను శివదర్శనంబు లభింపమి మహాకాళుండు మహాకోపముతోఁ దన వక్షమునుఁ జీరి నిజమాంసపిండంబును లింగంబుగాఁ బ్రతిష్ఠించి దాపున నున్న మడుపునకుఁ బోయి పుక్కిట జలంబు గైకొని యభిషేకముఁ జేసి మాంసంబు నర్పించి సాష్టాంగనమస్కారములు చేసెను. అతని యప్రతిమాన భక్తికి మెచ్చి శివుఁడు ప్రమథ

గణసహితంబుగఁ బ్రత్యక్షుండయి యతని శిరంబున కరంబిడి, " ఓ మహావీర ! నీ భక్తికి మెచ్చితిని. మదీయదాసులయందు మేటివి. నీకు గావలయు వరంబులం గోరుకొ "మ్మనెను. మహాకాళుం డమ్మహాత్మునితో నిట్లనియె : " ఓ దేవదేవా! నీ దర్శనంబున సమస్తపాపరహితుండ నైతిని. జగత్కారణుండ వగు నిన్నుగాక మఱి యన్యంబు నొల్ల. నా మనంబు నీయందే లగ్నం బగున ట్లొనరింపుము. ఇంతకంటె వేరు కోరిక లే"దనిన నాతని నైష్కామ్య తత్వంబునకు శివుం డచ్చెరువొందెను.

మహాకాళుం డేమి చేయుచున్నదియుఁ జూచుటకుఁగా నంది యచ్చటకు వచ్చెను. ప్రమథగణసహితుండై యున్న రుద్రునిఁ జూచెను. అతని మ్రోల భక్తాగ్రగణ్యుం డగు మహాకాళుం డుండెను. అంత నంది మహాకాళుం జేరంజీరి తనను గూడ శివానుగ్రహపాత్రుని జేయు మని ప్రార్థించెను. అంతట మహాభక్తిపరుం డగు మహాకాళుండు వైశ్యుని కోర్కె భగవానున కెఱింగింప నీశ్వరుండు వాని పూజావిధం బెఱింగిన వాఁడు కావున వాని మనోభీష్టము నెఱవేర్చి వారల నిరువురను ముఖ్యభక్తులుగఁ గైకొనెను. ఇట్లక్కిరాతుని మూలంబున నంది యుద్ధరింపంబడెను.

నంది మహాకాళు లిరువురు సారూప్యప్రసిద్ధి వడసి ప్రమథగణంబుతో విమానం బధిరోహించి కైలాసంబునకుఁ బోయిరి. వారలకు పార్వతీదేవి నీరాజనంబు లొసంగెను. అంతట మహాకాళ నందు లిట్లనిరి : " ఓ మహాత్మా! మమ్మిప్పటినుండి తమ ద్వారపాలకులుగ స్వీకరింపుఁడు."

అప్పుడు శివుఁడు వారల యభీష్టము నెఱవేర్చెను. అప్పటి నుండియు వారలు శివమందిర ద్వారపాలక ముఖ్యులైరి.

ఇట్లు పెక్కు సంవత్సరములు గడువ నొక్కనాడు శంకరుఁడు నందికేశ్వరు నిట్లని సంబోధించెను : "ఓయీ! నీమూలంబునగాని మానవలోకంబున భక్తిపథంబు చక్కఁ జేయఁబడదు. మదీయభక్తి నట బాదుకొల్పుము. అవనీ తలంబున బసవుం డను నామంబుతో వర్తిల్లుము. భూలోక మున ద్వితీయ శంభుత్వము నొందగలవు. నన్ను విడువవలసి వచ్చె నను విచారం బేమాత్రముఁ బొందవలదు. నీ వెచ్చట నున్నను నాకుఁ బ్రియతముండవు. నే నెల్లప్పుడు జంగమ రూపమునఁ జరింతును. కావున నీవు భక్తుల భక్తితోఁ గాపాడుము. ఫొ" మ్మనెను. అప్పుడు నంది ఈశ్వరానుజ్ఞను స్వామికిఁ బ్రదక్షిణ మాచరించి వందిమాగధులు స్తుతించు చుండ భూమండలమున కరుదెంచెను. ఈ పుణ్యపురుషుని రాకవలన భూతలం బంతయు పవిత్రమయ్యెను. ప్రజలు ముక్తి మార్గమునే యన్వేషించుచుండిరి. భూమి యంతయు శివా లయములతో నిండియుండెను.

అప్పుడు కర్ణాటక దేశమున మండంగి మాదిరాజను నమాత్యశేఖరుం డొకండుఁ గలఁడు. ఆతఁ డెల్లప్పుడును శశాంకశేఖరునే యారాధించుచు వేఱొండు తలంపకుండెను. అప్పుణ్యాత్మునకు పుణ్యాత్మయగు సతీమణి గలదు. అయ్యిందు వదన సౌందర్యంబున మిన్న. పతివ్రతా తిలకము. అప్పూఁ బోఁడి యుత్తమగుణముల కుప్ప. కృపామయి. పతిమాట కెన్నఁడు జవదాటి యెఱుంగదు. ఆమె యాసక్తితో సత్తమా

మల సేవ జేయుచుండెడిది. బంధుమిత్రులతో స్నేహభావము కలిగి యుండును. తన యింటంగల సకలవస్తుసముదాయమును మిక్కిలి జాగరూకతతోఁ జూచుచుండును. ఇట్టి సుగుణకులరూపముల మిన్నయగు మాదాంబ కొక కొఱంత కలిగెను. ఆమెకు సంతానము లేదు. సంతానము లేని విచారమామెను బీడించుచుండెను. ఆమె నోఁచని నోములు లేవు. సలుపని వ్రతములు లేవు. పుత్రసంతానము కలుగు తెఱవు చెప్పవలయు నని మాన్యులను వేఁడుకొనెను. అంతట వారలు నందినోము నోఁచిన నందనుండు కలుగు ననిరి.

పెద్దల యుపదేశప్రకారము మాదమాంబ నందినోము నోఁచుటకు సంసిద్ధురాలాయెను. సకలాభరణయై, భస్మరుద్రాక్షులు చేఁబూని వృద్ధవనితలు తనవెంటరా నందికేశ్వరాలయంబుకుఁ బయనమాయెను. అప్పు డామెకనేక శుభశకునములుఁ గానవచ్చెను. వారు మంగళవాద్యములతోను, గవిపండిత బృందములతోను నందిగుడి కేఁగిరి. మాదమాంబ నందికేశ్వరునిఁ గని సవినయమున నమస్కరించి పన్నీరుఁ గలిపిన శీతాంబువులచే నభిషేకంబు గావించి గంధము నలఁది పుష్పనికాయంబుతోఁ బూజలఁ గావించెను. అట్లు దశదినంబులుఁ జరుపవలయు నను శాస్త్రవిధి ననుసరించి పది దినంబులు నోము నోఁచెను. పదియవదినమున నందీశ్వరుని సుగంధజలమున స్నానముఁ గావింపఁజేసి మెత్తని యుత్తరీయంబున దడియొత్తి విలువగు వలువలు గట్టంబెట్టి కర్పూర కస్తూరికా కుంకుమాంకిత గంధంబుఁబెట్టి పువ్వుల దండలచే నలంకరించెను. సాలంకృతుఁడగు నందికిఁ బులగం

బును, నేయియుఁ బోసి, గుడంబును పాయసంబును, దదితర భక్ష్యముల నొసంగెను. నందికేశుండును వాని భక్తులును నా పదార్థముల నారగించిన తరువాత వాని నిట్లుఁ బ్రార్థించెను: "ఓ నందికేశా! నీవు భూతలంబున వెలసిన ద్వితీయ శంభుండవు. ప్రమథగణ నాయకుండవు. నీవే నాకుఁ బరమ దైవమవు. నీమీఁదనే యాధారపడి యుంటిని. నిన్నుంబోలు నొక పుత్రుని నా కొసంగుము. వానిని నీపేరఁ బిలుతుము. నా కోర్కె లీడేర్పుము" అని ప్రార్థించి ప్రసాదంబు గొని మాదమాంబ నేత్రములకు హత్తుకొని భర్తతో నిజగృహంబునకుం బోయి పుత్రుఁ డుదయించు నను సంతోషమున నుండెను.

అందఱు తమ గృహంబులకుఁ బోయిన తరువాత నందికేశుం డాలోచింపఁ దొడంగెను. నంది శివభక్తి భూతలంబునఁ బాదుకొల్పుటకుఁగా నియమింపఁబడెను. అట్టి సమయ మిప్పుడు చేకూరెను. కావున నంది మాదమాంబ గర్భమునఁ బ్రవేశించెను. మాసములు గడిచినకొలఁది గర్భ చిహ్నములుఁ గానవాయెను. పద్మవర్ణమున నుండు నామె చెక్కిళ్ళు తెల్లనగుచుండెను. గమనము మందగించెను. అరుచి ప్రబలెను. ఆవలింతలు హెచ్చుగా నుండెను. నవ మాసములు నిండెను. గర్భమున నున్న బాలుఁడు పరమ నిష్ఠతో శివుని నారాధించుచుండెను. పరంజ్యోతిస్వరూపం బగు వెలుంగును విశ్వంబెల్ల వెలిగించుచుండెను. ఇట్లు తపసిరై యామె గర్భంబున మూఁడు సంవత్సరము లుండెను. గర్భభారము దుర్భరముగ నుండెను. ఆ భారమును

సహించుకొనలేక యామె యొక దినమున నందికేశుని యాలయమునకుఁ బోయి కంటఁ దడిపెట్టుకొని వాని నిట్లు ప్రార్థించెను: "ఓ నందికేశ్వరా! నే కోరినంతనే నా కోరిక సఫలము గావించితివి. భూతలమున నున్న పుణ్యవతు లగు సతులు నవమాసములు నిండినంతనే ప్రసవించెదరు. నేను గర్భము దాల్చి మూఁడు వత్సరము లాయెను. ఇంతవఱకు ముక్కు మొగ మేర్పడి యుండలేదు. గర్భభారము దుస్సహముగ నున్నది. కావున నెట్లయినను కుక్షిభార ముడిగింపుము. అదియే నాకు మహోపకార మని తన చెలియలం గూడి మెల్లమెల్లనఁ దత్సహాయమున నడచుచు మందిరంబుఁ జొచ్చెను. ఆమె మిక్కిలి డస్సిపోయెను. చెలికత్తె లామెను మృదుపుష్పశయ్యాతలంబున పరుండఁజేసి శీతలోపచారంబులు చేయుచుండిరి. ఇట్లు సేయ కొండొక తడవునకుఁ గన్నులకు నిద్ర యాసన్నం బయ్యెను. నిద్రయం దా కలకంఠి యొక కలఁ గాంచెను. నందికేశుఁడు జంగమవేషముతోఁ బ్రసన్నుం డాయెను. "ఓ పద్మాక్షీ! నీవు సంతాపపడుటకు కారణము లేదు. నీ గర్భమున నొక మహనీయుఁడు కలఁడు. అతఁడు ప్రపంచమునం గల పాపముల పాఱఁద్రోలును. ఆ పుట్టిన శిశువునకు బసవఁ డను నామధేయముఁ గల్పింపుము. గర్భభారమున నన్న నవసరముగ దూషింపకుము." అని చెప్పి యంతర్ధాన మొందెను. అంతట మాదమాంబ మేల్కాంచి నందియే తన కట్టి రూపమునఁ గాన్పించె నని సంతసించి చెలులకు స్వప్నవిషయముఁ జెప్పెను. వారందఱు మిక్కిలి సంతోషించిరి.

ప్రసవసమయ మయ్యెను. పరంజ్యోతి స్వరూపుం డగు శివుఁడు మారువేషమున నచ్చటి కరుదెంచెను. ఆతఁడు దాల్చిన రుద్రాక్షలు, మేన నలందిన విభూతియు, బవిరిగడ్డము చూడ నీశ్వరుఁడని తోఁచును.నిగూఢవేషమున నున్న శివుఁడు మాదమాంబతో నిట్లనియె: " ఓ లలనామణీ! ఈ పిల్లవాఁడు లోకహితార్థమై జనించినవాఁడు. నే నీతని గురుండ"నని సెప్పి సాంగంబుగా లింగసాహిత్యం బొనర్చి వేంచేసెను. ఈ యోగీశ్వరుం డెవ్వఁడో యని యందఱు నాశ్చర్యపడఁ జొచ్చిరి. ఆ బాలుఁడు కోటిసూర్యుల మించి వెలుంగు చుండెను. ఆ తేజఃప్రభావమువలన మోహతామసము లనెడు తమంబులు పరాస్తము లయ్యెను. సతీపతు లా పిల్ల వానిని నయనానందముగఁ జూచుకొని సంతోషించిరి. తమ పురంబున నున్న సమస్త భక్తులను రప్పించి వారలకు యథోచిత సత్కారము లొనరించి వారి పాదముల గడిగి యా జలంబుచే పిల్లవానిని స్నానముఁ జేయించిరి. పంచమహావాద్యంబుల ధ్వానంబు భూనభోంతరాళంబుల నిండ దంపతు లా కుమారుని బసవన్న యను నామమునఁ బిలిచిరి. పిల్లవాఁడు దినదినాభివృద్ధి గాంచుచుండెను. బసవన్న శివభక్తిపరాయణుఁడు. అతనికి విద్య నభ్యసించు ప్రాయము రాగనే సకలవిద్యలు నేర్చెను. ద్వితీయశంభున కలవడని దేముండును.

మండంగిమాదిరాజు పుత్రున కుపనయనము జేయించుటకు సంసిద్ధుఁ డాయెను. అది గని బసవన్న తండ్రి కిట్లనియె: " ఓ జనకా ! శివుని యారాధించియు సమస్తమును తెలిసి యుండియుఁ బూర్వజన్మ దుష్కృతమువలన నరుని గురు

వుగాఁ బడయు టుచితమా ? పంచాక్షరీమంత్రపరున కితర మంత్రములతో నేమి పని ? జందెము కర్మపాశము. నన్ని కర్మాంబోధిని ముంచకుము. శివాంశోద్భవుండ నగు నన్ను బ్రహ్మజాతిం బడఁద్రోయకుము. రుద్రుఁడు కులరహితుఁడు. కావున నాకును కులముతో సంబంధము లేదు. నా కుపనయ నముఁ గావింపవల”దని ప్రార్థించెను. కాని మండంగిమాది రాజు “ఓ కుమారా ! విప్రులకు వేదమునందు పదునాఱు కర్మలు చెప్పఁబడి యున్నవి. ఆ కర్మలన్నియు నాచరించినవాఁ డుత్తముఁడు. ఆచరింపనిచో నధమాధముఁడు. ఉపనయన మా కర్మలలో నొకటి. దానివలన శివున కేమి విరోధము కలుగును ? నీవు రుద్రగణంబుతో నుపనయనమునకుఁ బోవచ్చును. నీవు ధరించు జందె మీశ్వరుని భీమఫణు లను కొనుము. పంచశిఖలు జటాపంచక మనుకొనుము. యజ్ఞోప వీతమును ధరింపుము. ఈ వేషము ధరించినకాని ద్విజుండు కానేరఁడు. బాలుండ వగుటచే నిట్లు పలుకుచున్నావు. కానకకన్న పట్టివగుటచే నిన్నింతకంటె కఠినము చేయఁ జాలము. ఈ యుదంత మంతయు విప్రులు విన్నచో నన్ను వెలివెడుదురు. వంశమునకును, గులమునకును గొప్ప పేరు కీర్తులు తెత్తువనుకొంటినిగాని కులమునకుఁ గుఠారమ వగుదు వని తలఁపనైతిని. ఉపనయనమున కొప్పుకొనినచో సరియే, లేనిచో నీకును మాకును సంబంధము లే”దని నిష్కర్షగాఁ జెప్పెను. అంత టాబాలుఁ డిట్లు ప్రత్యుత్తర మిచ్చెను: “ఓ తండ్రీ! నీవు ముమ్మాటికి బ్రాహ్మ్యమే భక్తిపథముగాఁ దలఁచితివేని శివభక్తికిని బ్రాహ్మ్యగతికినిఁ గర్మములయందు

మిక్కిలి వ్యత్యాసముఁ గలదు. పంచాక్షరీ మంత్రమే శివ భక్తునికి మంత్రరాజంబు; భస్మ రుద్రాక్ష విభూతిధారణయే వారల వేషంబు. ఇట్టి శివభక్తునికి ముక్తికాంత చేకూడును. బ్రాహ్మ్యంబునకును శైవంబునకును నైకమత్యము లేదు. బ్రాహ్మ్యంబు జగత్కర్మపాశము, కావున నట్టి బ్రాహ్మ్యంబు నేనొల్ల. మూర్ఖు లగువారలు వెలివేసినంతనే భయపడువాఁ డను గాను; మీయంతట మీరుండుఁడు. నాయంతట నే నుం డెద" నని చెప్పి నిజగృహంబు విడిచి పోయెను.

మాదమాంబ సోదరుఁడు బలదేవుఁ డను నతఁడు బిజ్జలాధీశుని కోశాధిపతి. అతఁడు బసవన్నను ప్రేమతోఁ బిలిచి తనయొద్ద నుండు మని నియోగించెను. బలదేవుని కొక పుత్రికామణి గలదు. ఆమెను బసవన్న కియ్యఁ దలంచెను. బసవేశ్వరుఁ డందుల కియ్యకొనెను. అంత బలదేవమంత్రి తన పుత్రికావివాహమును బురమంతయుఁ జాటఁబంచెను. పట్టణంబంతయు బహువిధముల నలంకరింపఁ బడెను. ఈ వార్తను విని పరమేశ్వరార్చనాపరులు తండోప తండంబులుగ విచ్చేసిరి. వారల కెదురేగి తోడ్తెచ్చి సుఖా సీనులం గావించి ధూపదీపాదులొసంగి భక్తితోఁ బూజిం చిరి. వారలు వినోదముకొఱ కా పురంబున గల సకల కవి గాయక వందిమాగధ నట నటీజనంబులను రప్పించిరి. వారలు తమ విద్యానైపుణ్యము గనపఱచుచు సభికుల నానందనిమగ్న మానసుల గావించిరి. అప్పుడు బసవన్న మనోహరముగ నుండునట్లు నుదుట త్రిపుండ్రరేఖలను రుద్రాక్షలను ధరించి సభం జొచ్చి పెద్దల పాదములకు మ్రొక్కుచుండెను. భక్తి

శృంగారపారంగతుం డగు బసవన్నం గని బలదేవుఁడు మిక్కిలి సంతసించి తన కుమార్తెను దోడ్తెచ్చి వానికి వివాహము గావించెను. వివాహానంతరము బసవన్న భక్తమండలి కభిమతార్థంబు లొసంగి వారివారితావులకు సాగనంపెను.

తదనంతరము బసవన్న యిల్లికప్పుడియందున్న సంగమేశ్వరుని దర్శింపఁ బయనమాయెను. బలదేవుండును దదితరులును బసవన్నను వెంబడించిరి. కొన్నిదినముల కా నగరము చేరిరి. సంగమేశ్వరునిమహిమచే నప్పుర మలకాపురమువలె నుండెను. ఆ పురమునఁ గల్లలాడువారు గానరారు. జారచోరులు లేరు. కృతఘ్నులు మందునకైనను దొరకరు. ప్రజలు ధరించు రుద్రాక్షలు, భస్మముం జూడ శైవశిఖామణు లని తోఁచును. అట్టి పట్టణము ప్రవేశించి సంగమేశ్వరుని యాలయమునకుఁ బోయి సాష్టాంగనమస్కృతి గావించెను. అప్పుడు సంగమేశ్వరుఁడు నిజరూపమున నాలయంబు వెలువడి, వినమ్రుఁడై యెదుటనున్న కుమారు నాలింగనముఁ జేసికొని యాతనిభక్తికి మెచ్చి యిట్లనియె: " ఓ బసవన్నా! నీ సచ్చరితము విని సంతసించితిని. శివభక్తులయందుఁ బ్రేమతో మెలఁగుము. శత్రువులైనను లింగేశ్వరు పూజించినచో శత్రుత్వము మాని మిత్రత్వము వహింపుము. పట్టినవ్రత మెన్నఁడు విడనాడకుము. భక్తులలో జాతిభేద మెంచవలదు. శివభక్తుల దూషించువారిని శిక్షింపుము. మహేశ్వరుని కర్పింపనిదే యేపదార్థమును భుజింపకుము. పరధనాదుల కాశింపకుము. జంగములను పూజింపుము." అని మృదుమధురోక్తుల నీతులం గఱపి వానిని దీవించి

యాలయములోనికిఁ బోయి తొల్లిటి విధముననే ప్రతిమగ మారిపోయెను. ఇదంతయు గాంచుచున్న పురజనులును బసవన్న యనుచరులును మిక్కిలి యాశ్చర్యమునుఁ జెందిరి బసవన్న యీశ్వరప్రియుఁ డనియు గొప్ప మాహాత్మ్యము గలవాఁ డనియుఁ జెప్పకొనఁదొడఁగిరి. ఆ సద్భక్తునిఁ జూడఁ బ్రజలు గుంపులుగుంపులుగఁ బోవఁజొచ్చిరి. బసవన్న యివ్విధముగ భక్తపరివేష్టితుఁడై మంటపమధ్యముననే దినములు బుచ్చుచుండెను.

బలదేవుండును రాజ్యంబు విడిచి యల్లునితోనే యుండెను. కళ్యాణపుర ప్రభు వగు బిజ్జలుఁడు బలదేవామాత్యుఁడు లేమికి విచారించి వానిని రప్పింపు మని మంత్రులకు నుడువ వారు బసవేశ్వరుని పిలిపించినచోఁ దమదేశము నందలి సమస్తారిష్టములు తొలఁగు నని నుడివిరి. పృథ్వీశ్వరుం డందుల కియ్యకొనెను. అమాత్యవరులు సంగమేశ్వరాలయమునకుఁ బోయి బసవన్న కిట్లనిరి: "ఓ మహాత్మా! నిన్ను మా యేలిక గొనిరమ్మని సెలవిడినాఁడు. మీబోటి పరోపకారపరాయణు లొక్క యిక్కడనే యుండినఁ దక్కుంగల వారలకు లాభ మెట్లు? మీరలు మారాజ్యమునకు విచ్చేసి యమాత్యపదవి స్వీకరించి రాజ్యరక్షణము వహింపుఁడు. మమ్ముల కృతార్థులఁ జేయుఁ"డన నందులకు వల్లె యని నిజ భక్తులతోఁ బ్రయాణమాయెను. అమాత్యవరులు వేఁడి నంతనే బసవన్న వచ్చునో రాఁడో యని శంకించి స్వయముగ బిజ్జలాధీశుఁడు బయలువెడలెను. ఎదురై వచ్చుచున్న బసవన్నం గాంచి వాహనంబు డిగ్గి యంఘ్రిచరుండై పోయి

వానికి స్వాగతమిచ్చి తన పట్టపుటేనుఁగుపై నా జగజ్జెట్టిం బెట్టి ప్రధానుల కందఱకుఁ బెద్దగాఁ జేసి పురంబునకుఁ దోడ్తెచ్చెను.

ఆ సచివాగ్రణి బహుకార్య నిమగ్నుండైనను జంగమ భక్తి వీడకుండెను. శివరాత్రులయందు మహోత్సవములు జరిపించుచుండెను. భక్తుల కోర్కెలందీర్చు మేటి. బసవేశ్వర దర్శనార్థము భక్తు లరుదెంచుచుందురు. బసవన్న వచ్చిన దాదిగ దేశము ఫలవంతముగ నుండెను.

సంగమేశ్వరుఁ డల్లమప్రభువవతారమున బసవేశ్వరు నిజభక్తి నెఱుంగఁదలఁచి కళ్యాణపురమునకు విచ్చేసెను. బసవన్న యా ప్రభునందు సంగమేశ్వరునిఁ గాంచి దండప్రణామంబు లాచరించి గద్గదకంఠుండై సన్నుతులు చేయుచు విచిత్రరత్నరచనా సింహాసనాసీనుం జేసెను. వివిధ భక్ష్యములు దెచ్చి ముందిడి యిట్లని స్తుతించెను: “ఆదిమధ్యాంతరహితుఁడా! నీ మహిమలు కనుఁగొన నెవరికి సాధ్యంబు? నే నొసంగిన పదార్థము భుజింపుము. నన్నుఁ గృతార్థుని జేయుము. నీకు నే నారగింపఁబెట్ట నెంత వాఁడను. మున్ను పార్వతీదేవియే తమ ప్రమథగణమున నొక్కని నేనియు తృప్తిఁబఱచ లేకుండెను.

“తొల్లి కైలాసంబున శంకరునిం గింకరులు గొలుచుచుండ పార్వతీదేవి భర్త కొలువున కరుదెంచెను. పేరోలగంబునంగల సర్వప్రమథగణము శివుని సారూప్యము బొంది యుండెను. అప్పుడు గిరిజాత నిజభర్తఁ గానక విచారమున మునింగెను. అంత నీశ్వరుం డామెయందు దయగలవాఁడై తన్నెఱింగించుకొనెను. గౌరీదేవి ప్రమథగణమునుఁ బొగడుచు

వారల కందఱకు విందుగావింప ననుజ్ఞ భర్తను వేఁడెను. శంకరుం డందుల కొప్పుకొనెను. ఆమె భూనభోంతరాళంబు నిండునట్లు భాండముల సమస్త పదార్థములు వండి సిద్ధముగ నుంచెను. ప్రమథగణాధిపుఁ డొక బాలకుని నోగిరిమాటయుఁ గామియుఁజూచి రమ్మని పంపెను. ఆ బాలుఁడు జగదంబ గేహమునకుఁ బోవ నన్నియు సిద్ధముగా నున్నవని చెప్పి యామె వారలను దోడ్కొనిరమ్మని కబురువెట్టెను. కాని బాలుఁడు తన యాకలి దీర్చికొనినఁగాని పోవఁజాల నని చెప్ప వానికి వడ్డించెను. తాఁజేసిన వంటకము లన్నియు బాలుఁ డొకఁడే భుజించెను. పార్వతి మిక్కిలి యాశ్చర్యమునుఁ జెంది యిది శివభక్తుల ప్రభావ మని తలఁచెను. కావున నో సంగమే శ్వరా! పార్వతీదేవియే మిమ్ముల సంతృప్తిపఱుపకున్నప్పుడు నే నెంతటివాఁడను. నేనిచ్చిన స్వల్పపదార్థముల భుజింపు" మని ప్రార్థించెను. ఆతఁడు బసవని భక్తి యెఱింగినవాఁడు గాన నా భక్ష్యముల నారగించి వానిని దీవించి తిరోహితుఁ డాయెను.

మఱొకసమయమున సంగమేశ్వరుఁడు బసవేశ్వరుని మాయాజంగమవేషముతో సందర్శించెను. జంగమరూప మునను్న సంగమేశ్వరుని బసవన్న తెలిసికొనెను. ఆ జంగము తనకు మూఁడవకన్ను కావలయునని కోరెను. అంతట బసవన్న ముకురంబు నొకటి యాతనిముందు పెట్టఁగ నతఁడు తన మోమునందు మూఁడు కన్ను లుండుటఁ గాంచెను. అప్పుడు సంగమేశ్వరుఁడు సిగ్గుపడి యదృశ్యుఁ డాయెను.

బసవామాత్యుండును, దదితర మంత్రివరేణ్యులును దమ ధరణీమండలమునం గల యుద్యోగులకు జీతము లిచ్చుటకు ధనము లెక్కించుచుండిరి. అట్టితఱి జంగమయ్యయొకఁడు విచ్చేసి బసవన్నను ధనము యాచించెను. వాని కోరికకు ధనమంతయుఁ జెల్లిపోయెను. అది గని తోడి మంత్రులు సహింపలేక తమ యేలికం జేరంజని యిట్లు విన్నవించిరి: "ఓ ప్రభూ! మేము విన్నవించునది కొండెము లని యెంచకుము. అట్టి వని యెంచి మేము విన్నవించుట మానినచో దేశమునకు ద్రోహము చేసినవారల మగుదుము. బసవన్న బొక్కసమునఁ గల ధనమెల్ల విచ్చలవిడి యర్థుల కిచ్చుచున్నాఁడు. ఇప్పుడు సేనలకు జీతములకై తీసిన ధనమంతయు నొక జంగమయ్య కిచ్చెను. ఇట్లిచ్చుచున్న బొక్కసములో ధన మెట్లుండును? రాజ్యపరిపాలన యెట్లు నిర్వర్తింపఁబడును? ఇఁకఁ దమ యిష్టమువచ్చినట్లు పరిపాలించుకొనుఁడు. మే మిదే పోవుచున్నా"మని నుడువ వారలను వారించి బసవనమంత్రిని వేగమే రప్పించి కోపఘూర్ణితుఁడై యిట్లనియెను: "ఓ బసవన్నా! నిన్ను నమ్మి ధనమంతయు నీ కొప్పగించితిమి. మాసధనులు పరుల ధనమున కాశింపరు. పరధన మిట్లు పాడుసేత నీబోఁటికిఁ బాడిగాదు. కావున మా సొమ్ము మా కొప్పగించి నీదారిని నీవు పోవుట లెస్స." నావుడు బసవన్న చిఱునవ్వుతో "ఓ యవనీనాథా! మదీయ భక్తులు ధనాశాపరు లని తలంపకుము. కుంభికుంభస్థలమునందలి మాంసము నాశించు సింహశాబకము పూరి మేయునా? శివపాదధ్యాన నిరతు

లగు నా భక్తులకీ తుచ్ఛధనములతో నేమి పని? కాదు అవు నని చెప్పి నే వాదంబాడను. మంత్రివరులం బిలిచి బొక్కసమునను న్న ధనము సరిజూపింపుము. అందు ధనము కానిచో నన్ను దండింపవచ్చు" నని పేరోలగంబున నెలుగెత్తి నుడివెను. అమాత్యవరులు రాజాజ్ఞను పురమునందలి ప్రజలు వీక్షించుచుండ ధనాగారమును దెఱచి ధనమును లెక్కించుచుండిరి. అందలి ధనము లెక్కకు సరిపోవుట గాంచి యెల్లరు విస్మయమును పొందిరి. శివభక్తుల మహిమ యని తెలిసికొనిరి. బిజ్జలుఁడు బసవన్నను నిందించినందులకు విచారమొంది నిండుకొలువున నిట్లని పలికెను: "ఇంతటి నుండి మా బండారి బసవన్నపై కొండెము లెవ్వఁడు చెప్పినను వాని నాలుకఁ గోయించి శిక్షించెద" నని చెప్పి బసవన్నను బహూకరించి నాడు కొలువు చాలించెను.

కళ్యాణిపురమున నొక వెలయాలు నివసించుచుండెను. దాని విటుఁడొక జంగముండు. ఆ వేశ్యకుఁ జేటిక యొండుఁ గలదు. ఆమె పురంబునం దిరుగుచు బసవనిమందిరమునకుఁ బోయెను. బసవని పట్టపుదేవి యగు గంగాంబ కట్టిన పుట్టము వీక్షించెను. ఆ వలువ విలువ యింతింతని చెప్పఁదరముఁ గాదు. దాని సాటివచ్చు చీర యొకటియుంగూడ నా పురమున లేదు. ఆమె యా చీరదిక్కున కాకర్షిత యయ్యెను. ఆ చేటిక తక్షణమేపోయి వేశ్యతో నాచీరశృంగారము వర్ణించెను. వెలయాలికి దాని నెట్లయిననుఁ బొందవలయు నను వేడుక పొడమెను. బసవయ్యను వేఁడినచో నతఁడు తప్పకిచ్చు నని తెలియును. ఆమె తనవిటకాఁడగు జంగ

మయ్యను ప్రియంబున జేరంజేరి తన వాంఛను వెలిబుచ్చెను. తనను వేఁడినదే చాలు ననుకొని బసవన్న కడకుఁబోయి చీర యిప్పింపు మని ప్రార్థించెను. జంగమదేవరకోరిక వినిన వెంటనే బసవయ్య తనభార్యను నిండుకొలువునకు రప్పించి యామె ధరించిన పుట్టము జంగమున కిమ్మని యాదేశించెను. ఆమె సందేహించుచుండ బసవన్న పేరోలగంబున స్వయముగా నామె మేనిచీర నొలిచి యిచ్చెను. అందఱు విస్మయముఁజెంద నామె యెప్పటివలె వస్త్రావృతయై యుండెను. భక్తురాలగు నామె కెన్నఁడును నవమానము కలుగదు. పేరోలగంబునఁ గల ప్రజలెల్లరు బసవని జంగమ భక్తిని మెచ్చుకొనిరి. బసవఁడు తన్నర్థించినయెడల నేవస్తువు నైనను నిచ్చుటకు వెనుదీయువాఁడు కాఁడు. వెనుదీయుచో నీ జంగ మడిగినంతలో తనభార్య వలువను గూడ నూడఁదీసి యిచ్చునా? జంగమవిటకాఁడా చీరను గొని తన విటకత్తె కిచ్చి యామెను సంతోషపెట్టెను.

వేఱొక్క సమయమున జంగమలింగ మొకండు వచ్చి బసవేశ్వరుని ముత్యములు కావలయు నని కోరెను. అంత బసవన్నదగ్గఱ నున్న జొన్నలరాశిం జూచి యందలి ముత్యాలు గొను మనెను. తక్షణమే జొన్నలరాశియంతయు ముత్యములప్రోవై యుండెను. అప్పుడు జంగమలింగము తనకుఁ గావలయు ముత్యములను గొనెను.

ఇవ్విధంబున బసవేశ్వరుని మహిమ భూలోకమున వ్యాపించెను. అందువలననే ప్రతి శివాలయమునకును ముందు బసవని విగ్రహ ముండును. బసవుండు కొంతకాలము శివ భక్తి వ్యాపింపఁజేసి లింగైక్యము నొందెను.

# 5. పార్వతి

సతీదేవి హుతాశనజ్వాలలం బడి మృతినొందిన వెనుక నీశ్వరుఁడు ప్రమథగణసహితుండై హిమవత్పర్వతాగ్రంబున కరిగి తపంబొనరించుచుండెను. అట్టిదినములలో తారకాసురుం డను రక్కసితేఁడు దేవతలం బాధించుచుండెను. దేవతలు వానిని దుదముట్టింపనెంచి చతుర్ముఖునికడకుం బోవ నాతఁడు శివుని కొక కుమారుఁ డుదయించినయెడల యుష్మదీప్సితంబు నెఱవేఱు నని చెప్పెను. తత్కార్యసిద్ధికిఁ బ్రథమమున మహేశ్వరునకు భార్యం గల్పింపవలయును. గగనవాణి యక్కార్యమును హిమవంతుని నెఱవేర్ప నియోగించెను. హిమవంతుఁ డందుల కియ్యకొనెను. కొంతకాలమునకు హిమవంతునిభార్య గర్భము ధరించెను. దక్షుని యజ్ఞమున కాహుతియైన దాక్షాయణి యామె గర్భముఁ జొచ్చెను. మహాశక్తియు, రుద్రకాళియు, మేధాస్వరూపిణియుఁ బవిత్రురాలును నగు నయ్యాదిశక్తి మేనకగర్భంబుఁ జొచ్చుట నెల్లరు సంతసించిరి. ఆమె నవమాసంబులు నిండ నొక శుభలగ్నంబున దేవదుందుభులు మ్రోయ - నచ్చరలు నాట్యంబుసేయ చారువిలోచన యగు నొక కుమార్తెంగనెను. దేవతలెల్లరు ముదంబొంది పుష్పవృష్టిం గురిసిరి. రాక్షసులు చింతాక్రాంతులైరి. జననీజనకులా పుత్రిం జూచి సంతోషాబ్ధి నోలలాడిరి. ఆ బాలికకుఁ బార్వతి యని నామంబుఁ బెట్టిరి. పార్వతి హిమవంతుని ప్రియపుత్రికయై దినదినాభివృద్ధి బొందుచుండెను. బాల్యమునఁ దోడి బాలికలతోఁ గూడి

యాటలు పాటలయందు కాలముఁ బుచ్చుచుండెను. వయస్సు వచ్చినకొలఁది బాలికయందు వింతమార్పులు కలుగుచుండెను. ఆమెసౌందర్యము నిరుపమానము. సద్గుణములు వర్ణనాతీతములు.

ఒక దినమున హిమవంతుఁడు తన పుత్రికాలలామంబును దోడ్కొని నిజశిఖరంబునఁ దపం బొనరించుచున్న మునీశ్వరుని దర్శింపఁబోయెను. ద్వారపాలకుండగు నందీశ్వరుఁడాటంక పెట్టి తమ యేలికకడకుఁ బోయి వారి రాకఁ దెల్పెను. రుద్రుండు వారికిఁ బ్రవేశమునకు ముదల యిడెను. ఈశ్వరాజ్ఞఁ బడసి పుత్రికతోఁ లోనికిం జని హిమవంతుఁడు, చంద్రకళాభూషణుండును, నిమీలితలోచనుండును, వేదాంతవేద్యుండును నగు న మ్మహామహునకు నమస్కరించి యిట్లనియెను: "ఓ శశిభూషణా! నీ దర్శనంబున నే ధన్యుఁడ నైతిని. ఈమె నా పుత్రికామణి. మీబోఁటి పెద్దల సేవయందుఁ గడు నిపుణత గలది. కావున మా కిరువురకు ననుదినము తమ దర్శనం బొసంగి మాచేయు పూజలుఁ గొనుఁడు. ఇంతమాత్రపు టూడిగంబునకు మా కనుజ్ఞ నిండు." అనవుడు నీలకంఠుఁడు వారి కిట్లు ప్రత్యుత్తర మొసంగెను: "ఓ పర్వతరాజా! నీవొక్కరుండ వచ్చుచో మదీయధర్మంబున కభ్యంతర మేమియు నుండదు. నీ తనయను మాత్రము తీసికొని రావలదు. నిష్కాములమై తపం బొనరించు మాబోఁట్ల యాశ్రమమునకుఁ జంచలాత్ములు రాఁదగదు. వారు వచ్చిన మా కార్యముల కాటంకము. ప్రకృతిరహితుల మగు మాకు మీ కాంతాజనముతోఁ బని లేదు. కావున నీవే

యగుదెమ్ము." స్త్రీజనసపర్యానిరాసకము లగు నిరాహారి
మాటలకుఁ బార్వతి మానముగ్ధత్వము వహింపలేకపోయెను.
మెల్లన శివునిమాటలకుఁ బ్రత్యుత్తర మందుకొనెను. "ఓ
మహాత్మా! నీవు ప్రకృతిరహితుండ నని పల్కుచుంటివి. నీవు
ప్రకృతేతరుండ వగుచో ని న్నెవరు సందర్శించిన నొక్కటియే
గదా! అట్టివానికి తపం బనావశ్యకంబు. వాని కిదమిద్ధము
లేదు. నీవు ప్రకృతిసహితుండవు. అందువలననే యిట్లు
పలుకుచుంటివి. ప్రకృతిస్వరూపులకుఁ గామాదుల భయము
తప్పదు." అని నుడివి మెల్ల నూరకున్న మహేశ్వరుం
డామెబుద్ధికుశలతకు సంతసించి యనుదినమును వారలు
తన యాశ్రమమునకు వచ్చుట కనుజ్ఞ నిచ్చెను. అంతట
వారలు సెలవుగైకొని తమ గృహమునకుఁ బోయిరి.

అనుదినము హిమవంతుఁడు గిరిజతో మహేశ్వరు
పాలికిం జని యతనికి సేవఁ జేయుచుండెను. అంతట నింద్రాది
దేవతలు పార్వతీపరమేశ్వరులకు దాంపత్యసిద్ధి యెట్లొకో
యని తలంచుచుండిరి. వారలకు దాంపత్యసిద్ధి లేనిదే
తారకాసురుని వధించు కుమారుఁడుఁ గలుగనేరఁడు. ఇది
మదనుండుగాక మఱొకండు జేయఁజాలఁడని వానిని బ్రోత్సా
హించిరి. వారలు నియోగించిన ప్రకారము మదనుండు
నిజపరివారముతోఁ జని సమయమునకై వేచియుండెను.
విశ్వమాత యగు పార్వతి పరమేశ్వరుని కంఠంబునఁ గుసుమ
మాల వైచి సేవించుసమయమున మదనుండు నిశిత మగు
కుసుమశరంబున నీశ్వరుని బిగువుఱెదఁ దనునిఖాతించె.
అతని మనస్సప్పుడు చలించినది. మనశ్చాంచల్య కారణం

బరయుట కతఁడు శిరము పైకెత్తెను. అచ్చట మదనుండు గోచరం బయ్యెను. శంకరుం డా కుసుమశరు నవలోకించి రోషారుణితనేత్రుండై తృతీయనేత్రాగ్నిచే వానిని భస్మీభూతుం గావించెను. దేవత లెంత వేడినను వానిని సజీవునిం జేయక యతఁ డదృశ్యుం డాయెను.

శశికళాధరుండు శైలంబునుండి యంతర్ధాన మగుటవలనఁ బార్వతి విచారసాగరమగ్నయై కంటికి మంటికి నేకధారగా నేడ్చుచుండెను. కొన్ని సమయములందు నిస్పృహ జెందుచుండెను. ఇట్లు కొన్నిదినములు విచారించి తా నెట్లయినను బరమేశ్వరుని దర్శించి భర్తగా గైకొనవలయు నని కృతనిశ్చయయై తపం బాచరింప మొదలిడెను. పార్వతి మాతాపితలరుదెంచి "అమ్మా! నీ వీ ఘోరతపం బొనరింపఁ జాలవు. తపంబుచే నీ సుందరాకారము నేల శుష్కింపఁ జేసికొనెదవు? మహాతపోధనులకుం గూడ సాధ్యము కాని శశిధరుండు నీకుఁ బ్రత్యక్షమగుట దుర్లభము. నీ శ్రమము నిష్ఫల మగును. కావున వైళంబ పయనంబై గృహంబునకరుదెమ్ము. నీకుం దగు వరుని వెదకి పాణిగ్రహణంబు గావించెదము. వానితో సుఖముండవచ్చును లె"మ్మనిరి. వారి కడపటివాక్యము లామె హృదయమున ములుకులై నాటెను. "ఓ జననీజనకులారా! నే నీశ్వరునే హృదయవల్లభునిగఁ దలంచితిని. అట్టి నన్ను మఱొకని కిచ్చెద మని చెప్పుట మీకుఁ దగదు. అతనిం దప్ప వేఱొక్కనొల్ల. అతండు మదీయ ప్రార్థన నాలించి కైకొన్న సంతసము. లేనిచోఁ దత్పాదధ్యాననై ప్రాణంబులు విడుతును. మఱొండువిషయము

నా చెవులఁ జొరనీయకుఁడు. నేను గృహంబునకు రాఁజాలను. గృహాపేక్షకులకుఁ బరమేశ్వర సందర్శనము దుర్లభము. నా ప్రతిజ్ఞ కడ్డంకులు లేవు. మీర లింటికిఁ జనుఁ"డని పలికెను. మేనకా హిమవంతులు పార్వతీ దృఢ సంకల్పము మార్చలేక పలువుర నెచ్చెలుల నామెసేవకై వినియోగించి తమ గృహంబునకు మగిడివచ్చిరి.

అప్పుడు పార్వతి పూర్వము శివుఁడు తపము గావించినచోట నొక వేదిక నిర్మించుకొని యీశ్వరధ్యానమై యుండెను. ఆమె కొంతకాలము పర్ణములు భక్షించెను. మఱికొంతకాలము జలము ద్రావెను. వేఱొండుకాలము వాయుభక్షణ మాచరించెను. ఇట్లామె నిరాహారియై పదాంగుష్ఠమాత్రంబున నిలిచి ఘోరతపం బొనరించుచుండెను. ఎన్ని యాటంకములు కలిగినను దన మనోనిశ్చయము సడల లేదు. ప్రపంచమంతయుఁ దపోగ్నిజ్వాలలచే నుడుకెత్తుచుండెను. దానికిం దాళలేక దేవతలందఱు బ్రహ్మపాలికిం బోయి వాని కిట్లు మొఱపెట్టుకొనిరి: "ఓ జతురాననా! యేదియో మహాగ్ని బయలువెడలి మమ్మందఱ దహించుచున్నది. పుట్టించినవాఁడవగుటచే రక్షించుట నీకుఁ గర్తవ్యము. దాని నెట్లయినను నిశ్శేషము గావింపుఁ"డనిన నాతండు దివ్యదృష్టివలనఁ గనుఁగొని చింతాక్రాంతుఁడై ముకుందునిపాదములంబడి యావద్వృత్తాంత మెఱింగించిన ముకుందుండు వాని కిట్లనియె: "బిడ్డా! దీనికిఁ బ్రతిక్రియ మన మేమియుఁ జేయఁజాలము. శివుండు ప్రత్యక్షంబైనగాని పార్వతి తపంబు విరమింపదు. ఆమె మానినగాని లోకమున కీయాపద

తీఱదు. కావున మీరలెల్లరు పోయి శంకరునే ప్రార్థింపుఁడు. అచ్చటికిఁ బోయినచో మన్మథునియట్లు భస్మీకరించు నని భయపడకుఁడు. మంగళప్రదుఁ డగు సదాశివుం డెరికి నపకృతి నొనరింపఁడు. కాన నా పురాణపూరుషునిఁ జేరి ప్రార్థింపఁ బొండు." అనిన దేవతలు తనవెంటరాఁ జతురాననుఁడు శంకరసందర్శనార్థమై వెడలెను.

సమస్తప్రమథగణావృతుండును దపస్సమాధియుక్తుం డునై యున్న సర్వేశ్వరుం గని దండప్రణామంబు లాచరించి తమరాకకు గతం బెయ్యది యనవుడు చతురాననుం డిట్లని నివేదించెను: "ఓ దేవదేవా! తారకాసుదౌష్ట్యాగ్నియుఁ బార్వతీ తపోజనిత తీవ్రాగ్నియు జగంబెల్ల భీభత్సము గావించు చున్నవి. నీకుమారుండుగాని వేఱొకండు తారకుని వధింపఁ జాలఁడు. పార్వతిని దమకు దేవిగాఁ బరిగ్రహించినఁగాని యామె తనపట్టు విడువదు. కావున లోకార్థము నీ వామెను వివాహంబయి కుమారునిం బ్రసాదించి మమ్మా విపత్తుల నుండి కాపాడుదువుగాక" అని ప్రార్థించిన శంకరుఁ డిట్లనియె: "చతురాననాది దేవతలారా! మదనుని వధించి జగంబు నిష్కామంబు గావించితిని. నేనిప్పు డామెను బరిగ్రహించిన మదనుండు పునర్జీవి కావలయు. దానఁ బ్రపంచమంతయుఁ గామక్రోధలోభమోహాదులచేఁ గలుషిత మగును. కావున మీరలును నావలె నిష్కాములైయుంట మేలు. మీ రెన్నడు నన్యాయకృత్యమునకు బ్రోత్సహింపక వెడలుఁడు." అని చెప్పి మౌనము వహించెను. అంతట వారలు విచారమగ్న మానసులై తమ గృహములకుం జనిరి.

శంకరుండు ధ్యానాసక్తుండై యాత్మచింతన మొనరించు చుండెను. స్వచ్ఛంబును, నిర్మలంబును నగు పరమాత్మ స్వరూపము నారాధించుచుండెను. అప్పటికిఁ బార్వతి తపోగ్నిజ్వాలలు రుద్రునవరకుఁ బ్రజ్వరిల్లెను. ఫణిభూషణుండు భయకంపితుఁ డాయెను. తా నశ్రద్ధ చేసినచో లోకమంతయు దగ్ధమగునని కొనెను. వెంటనే సమాధినుండి లేచి పార్వతి కడకేఁగెను. పార్వతి సఖీజనావృతయై నుండెను అప్పుడు శంకరుఁడు బాలబ్రహ్మచారిరూపమును ధరించి యామె సఖులతో నిట్లనియె: " ఓ యువతీమణులారా! ఈ మానినీ తిలకమెవ్వరు ? అసమాన సౌందర్యమునుం గల యీ కన్యక యేమి నిమిత్తంబున ఘోరతపం బాచరించి తనుకుసుమమును వాడఁబెట్టుచున్నది ? ఇయ్యుదంతంబు నాకెఱుఁగవచ్చునా ?" నావుడు వారలు సఖీవృత్తాంతము తేటతెల్లముగ నంతయు నుడివిరి. ఈశ్వరుం డామె మనస్సు కనుఁగొన మఱల నిట్లనియె: " ఓ యువిదలారా ! మీ నెచ్చెలి బాల్యచాపల్యమున నిట్లు చేయుచున్నదనుకొందు. మీఁదుమిక్కిలి నామె మూఢురాలనియుఁ జెప్పవచ్చును. మీరైన నామెకు హితవు గఱపకుండుట లెస్సగాదు. చెలికత్తెలు చేయవలసిన పనులు మీరు చేయజాలకున్నారు. ఆ నిజసౌందర్యసమాకర్షిత చిత్తుఁడై రుద్రుఁడు వచ్చి తన్ను వివాహము చేసికొమ్మని ప్రార్థించినను నిరాకరింప దగిన త్రిలోకసుందరి. ఆతని యాకారము మిక్కిలి భయము గల్పించును. . అట్టివానికై యీ జవ్వని తపంబొనరించుచున్నదియా ? ఈమె తెలివి తక్కువ కేమనవచ్చు ? ఆతఁడు ధరించునవి యేహ్యము లగు

వస్తువులు. ఆతఁడు కపాలధరుండు. శ్మశానవాటికానిల
యుండు. శ్మశానభస్మ మంగరాగము. చర్మము గట్టు
పుట్టము. పిశాచములు సహచరులు. బిచ్చమెత్తుకొనుట
జీవితాధారము. మీ నెచ్చెలి వరించిన మహామహుని
వృత్తాంత మిట్టిది. మనోహరాకారు లగు తదితర సురయువకు
లుండ నీ బిచ్చగానినే వరించుట వింతగా నున్నది. ఈమెకు
మతి భ్రమించియుండనోవు" నావుడు పార్వతి వానిపైఁ
గోపారుణితవీక్షణము లొక్కపరిఁ బ్రసరించి చెలికత్తెలం
బిలిచి "ఆ బ్రహ్మచారితో మీ కేమి పని? వానిని విడిచి
మీ రిటకు శీఘ్రముగరం"డని యా బ్రహ్మచారి నుద్దేశించి
"ఓయీ! నీకూత లిచ్చట పనికిరావు. వెంటనే మదీయాశ్ర
మము వీడి పొమ్ము. పోకున్న గెంటింతు"ననవుడు బ్రహ్మ
చారి చిరునగవుదొలఁక నిట్లనియె: "ఓ యువతీమణి!
నీ కింతటి యాగ్రహమేల? ఇన్ని దినములనుండియుఁ దపం
బొనర్చి నీవు పడసిన ఫల మియ్యదియేనా? నిజమాడిన
నిష్ఠుర మను వాక్యము వ్యర్థమగునా? నే జెప్పినదానియం
దేమైన నసత్యము గలదా? నాపై వృథా కోపించుచున్నావు.
ఈశ్వరుండు గర్భదరిద్రుఁడుగాఁ డని యెవ్వ రనఁగలరు?
భయంకరరూపుఁ డని యతని వికృతాకారమే చెప్పక చెప్పు
చున్నది. ఇట్టివానిని నీవు వరించి పెండ్లియాడినమాత్రమున
లోకము వేఱువిధముగఁ జెప్పుకొనునా? లోయ మాయ
నగునుగాని లోకమును మాయనగునా? లోకము నిజమును
నుడువుట మానదు. నీ కాగ్రహము జనించునని నేను నిజ
మాడుట మానుదునా? ఎప్పటికి నసత్యము పలుకనొల్ల"

ననవుడు పార్వతి వానివచనములు పాపభూయిష్ఠంబు లని చెవుల మూసికొని నెచ్చెలులచే నతని నచ్చటనుండి వెడల గొట్టింప నుంకించెను.

అంతఁ బరమేశ్వరుఁడు పార్వతి యమేయభక్తికి సంతోషించి నిజరూపంబున బ్రత్యక్షమయ్యెను. ఆమె వెంటనే వేదికనుండి దిగి యప్పరమేశ్వర పాదారవిందములకు నమస్కరించి మౌనము దాల్చియున్న నామెనుఁ జూచి "ఓమానినీతిలకమా! నీకెయ్యది యిష్టంబో దానిని వేఁడుము. ఇచ్చెద" ననవుడు గిరిజాత లజ్జావదనయై మెల్లన మృదుమధురకంఠంబున నిట్లని వేఁడెను: "ఓ మహాత్మా! నీవు మదీయ హృదయేశ్వరుండవు. మీవలన నాకు జనించు పుత్రుఁడ కాని మఱియొకండు తారకాసురుని వధింపలేఁడు. వానిని సంహరింపనిచో దేవేంద్రాదు లుద్ధరింపఁ బడరు. సురసంరక్షణార్థము బద్ధకంకణుండవై వెంటనే నా జనకుండగు హిమవంతు నర్థించి విధివిహితంబుగ నన్నుఁ జేకొనుము. తొల్లిటి జన్మమునందు మదీయ జనకుండగు దక్షుఁడు యథోచితముగ నుద్వాహంబొనరింపలేదు. అందుచే నది ఛిద్రంబయ్యెను. కావున నిప్పుడు యథోచితముగ గ్రహదోషంబులుఁ బాపుకొని శుభముహూర్తంబున నన్నుం బాణిగ్రహణముఁ గావించుకొను" మన నాతం డిట్లు పలికెను: "ఓ దేవీ! ఈ సమస్తజగములు మనచేతనే సృష్టింపఁబడినవి. అట్టియెడ నాయుడుగణంబు మనల నెట్లు బాధించును! నేను పోయి హిమవంతుని యాచించుట మిక్కిలి హీనముగా నుండదే!" యన నగ్గిరిజాత "ఓ మహాత్మా! నీవు చెప్పిన దంతయు

సత్యము. కాని లౌకికధర్మప్రకారము విధిహితంబుగ సమస్తకార్యములు నెఱవేర్పవలయును. కావున నివ్వివాహంబు మదీయవచనానుసారి కావలయు. నా జనకుని నర్థించి నాకు సౌభాగ్యము ప్రసాదింపుఁడు. మాఱుపల్కక క్షమింపుఁడు. లోకవిడంబనార్థ మిట్లు చేయుట నామనవి" యనిన నా దేవిపలుకు శంకరుండు వల్లె యని కైలాసంబునకుఁ బోయెను.

ఈ యుదంతం బంతయు గిరిరాజునకుఁ దెలియ బంధుమిత్రులతో పార్వతిం జూడ నేగుదెంచెను. వారలం గని యగ్గిరిజాత సంతసమున నెదుర్కొని దండప్రణామంబు లాచరించెను. మేనకా హిమవంతు లామెను లాలించి చుబుకంబు దువ్వి యూరుపీఠంబునఁ గూర్చుండఁబెట్టుకొని యామెను వ్రతసమాప్తి యెఱింగింపు మని కోరిరి. ఆమె యావద్వృత్తాంతము సవిస్తరముగ తెలియపఱచి వారల నమందానందాబ్ధిని దేల్చెను. ఆమె తపశ్శక్తి కందఱు విస్మితులైరి. పరమేశ్వరుని బ్రత్యక్షము గావించుకొనిన పార్వతిని బ్రస్తుతించిరి. మంగళవాద్యంబులతో గిరిరాజు నిజకుమార్తెనుం దోడ్కొని యింటి కరిగెను. దేవతలు తమ యభీప్సిత మీడేరె నని మిక్కిలి సంతసించుచుండిరి.

అచ్చట శివుండు పార్వతీ వియోగమును భరింపలేకుండెను. తాను హిమవంతునిపాలి కరిగి యర్థించుటకంటె నేరినైనఁ బంపిన విధ్యుక్తముగా నుండు నని తలఁచెను. సప్తమహర్షు లీకార్యమునకుఁ దగినవా రని యెంచి వారల రప్పించి కార్యసంధానమునకై నియోగించెను. ఈశ్వరాజ్ఞా

వర్తులై మునిసప్తకము హిమాలయముం జేరి హిమవంతునిచే నుచిత సత్కారముల నొంది సుఖాసీను లైరి. అట్టియెడ మహర్షులం గని నగాధిపతి వారల కిట్లనియె: "ఓ మహాత్ము లారా! మీ రాకవలన నా గృహంబు పావన మయ్యెను. మీబోంటి పెద్ద లూరక రారు. మీ రరుదెంచిన కారణంబు సావధానముగ విన వేడుచున్నాఁడ" నన నగపతికి ముని పతు లిట్లు పలికిరి: "ఓ రాజా! మే మీశ్వరునిపంపున వచ్చిన రాయబారులము. అతఁడు నీ కుమార్తెను వలచియున్నాఁడు. మమ్ముల నిన్నడిగి నీ పుత్రికారత్నమును దనకుఁ బాణిగ్రహ ణము గావింపుమనినాఁడు. ఆ బాలిక నొక్కసారి మాకుఁ జూపింపుము. నీ యిష్టమును తెలియపఱచుము." అన నీశ్వ రుఁడు తనకల్లుఁ డగుచున్నందులకు నగేంద్రుఁడు లోన సంత సించెను. కాని దానిని గప్పిపుచ్చి కొంత యనిష్టము చూపునట్లు నటించి యిట్లనియె: "ఓ మహర్షులారా! మహావిరక్తుం డగు శంకరునికి వివాహము కావలసివచ్చెనా? దరిద్రునకును, వృత్తిహీనునకును, విరక్తునకును కన్యాదానము గావింపరా దని శాస్త్రములు ఘోషించుచున్నవి. ఈశ్వరుని కీ గుణత్ర యంబునుఁ గలదు. ఇట్టివానికి ముద్దులొలుకు నా చిన్నారి కుమార్తె నెట్లొసంగుమందురు? ఇచ్చినచో నామె సుఖిం చునా? కుమార్తెలను దగినవరుల కిచ్చుట జననీజనకుల విధియై యున్నది. మీ కేని యుక్తమని తోఁచిన మీ యిష్టాను సారముఁ జేయుఁడు. మీ కెదురాడను. ఉభయపక్షముల లోపాలోపములు గ్రహింపఁగల్గు మహాత్ములరు మీరలరు. ఇఁకఁ దమచిత్త" మని చెప్పి కూఁతు రప్పించి వారలకుఁ

జూపెను. నిరుపమానరూపవతి యగు నామెను ఋషీశ్వరులు గాంచి శివునకుఁ దగు కన్యక యని తలంచి హిమవంతు నొప్పించి కైలాసంబున కేఁగి యావద్వృత్తాంత మీశ్వరునకు నివేదించిరి.

అంత శివుం డమితానందమును బొంది బ్రహ్మవిష్ణు మహేంద్రాది దేవతలకెల్ల నాహ్వాన పత్రికల నంపె. వారం దఱు సపరివారంబుగఁ గైలాసంబునకు వచ్చిరి. వారలనందఱి నాహ్వానించి పెండ్లిపెద్దలుగ నియమించెను. "ఇదివరలో వివాహంబు సంకల్పరహితంబుగఁ జేయుటచే నది విఘ్న మాయెను. అందువలన నిప్పుడు వేదమంత్రయుక్తంబుగా నగుప సంకల్పించి లోకధర్మము ననుసరించి వర్తించుట యుచిత"మనిన నెల్ల రామోదించిరి. బ్రహ్మ పౌరోహిత్యము వహించెను. సప్తర్షి మండల మాతనికి సహాయభూతులై నిలువఁబడిరి. శుభముహూర్తము నియమింపఁ బడెను. తరలి వెడలుదినమున బ్రహ్మాదు లభ్యుదయోచితంబు లగు కర్మం బుల నొనరించిరి. కశ్యపుఁడు గ్రహముల నారాధింపఁ జేసెను. వరుని జటాజూటమును నలంకరించిరి. శశికళాలం కృత జటాకలాప మతి రమణీయముగ నుండెను. భుజంగ కుండలుండును, సర్పోపవీతుండును, నురగవలయుండును నై యలరారుచుండెను. చర్మాంబరమును ధరించెను. మేన నలందిన విభూతి సుగంధబంధురం బయ్యెను. ఇట్లు వరుఁడు సర్వాభరణభూషితుండై నందివాహనం బారోహించి హిమవత్పర్వతమునకుం బయలుదేరెను. ఆతని వెంబడించి సకల ప్రమథగణము నడవఁజొచ్చెను. విష్ణుండును బ్రహ్మాది

దేవతలును భార్యాసహితులై నిజవాహనంబులపైఁ బోవు చుండిరి. వేదఘోష భూమ్యాకాశంబులు ప్రతిధ్వనులీన మహర్షి మండల మరుదెంచుచుండెను. ఇట్లొకరి వెంబడి నొక రసంఖ్యాకులై తరలిపోవుచుండిరి.

హిమవంతుండు వివాహ ప్రయత్నములు జరుపుచుం డెను. విశ్వకర్మం బిలిపించి పరిణయవేదికను నిర్మింప నియోగించెను. వివాహవేదిక నిర్మించిన యనంతరము శత సహస్ర యోజన వైశాల్యముగల వివాహమండపము నిర్మించెను. అందు విశ్వకర్మ బుద్ధికౌశలము విపులముగఁ గానవచ్చును. ఆ మండపము వివిధరత్నసమన్వితంబై యలరారుచుండెను. అందిదమిద్ధం బని పలుకుటకుఁ గూడ వీలుగాకున్నది. కృత్రిమస్వరూపంబునఁ గట్టఁబడినది. దానఁ బశుపక్షిపిపీలకాది సకలజీవులు రమణీయముగఁ జిత్రితములైనవి. దేవతలలో చిత్రింపఁబడనివా రెవ్వరును లేరు. వివాహభవనము మిక్కిలి నిపుణతతో నిర్మింపఁబడి యెను. విధాతృప్రేరితుఁడై నారదుఁడు తదీయమండప సౌందర్యమును జూచిరాఁబోయెను. నారదుఁ డచ్చటకుఁ బోయి యందుఁ బ్రతిఫలించిన నిజమూర్తికానికరముల నరసి కడుంగడు విభ్రాంతి జెందెను. నారదుండు మగిడి బ్రహ్మయొద్దకుఁ బోయి మండపమునంగల దృశ్యములను వర్ణించి చెప్పి ప్రక్కనున్న నింద్రు నవలోకించి “ఇంద్రా! విశ్వకర్మ నీకుఁ బ్రత్యపకృతి సేయు నుద్దేశముతో నుండెను. ఇప్పుడు శంకరునితో నరుగుచున్న దేవదానవ మనుష్య సంఘములలో మండపమునఁ జిత్రింపఁబడనివాఁ డొక్కఁడును

లేఁడు సుమీ" యన దేవేంద్రుఁడు భయకంపితుఁడై విశ్వకర్మ తన కపటకృతి నొనరించు నని తలఁచి వెనుకకు మరలుట కుద్యుక్తుఁ డాయెను. అంత మాధవుండు నగి వానితో నిట్లనియె: "ఓ దేవేంద్రా! విశ్వకర్మ నిన్నవమానపఱచుటకు సిద్ధముగానుండె ననుట నిజము. మూఢులు తలంచినంత మాత్రముననే వారల కోరికలు సిద్ధింపనేఱవు. ఇంతలో బేలవై తిరిగిపోవు టుచితమును గాదు. మాయను జయించు నమృత విద్యాబలము నీయొద్దనుండ భయమేటికి? ఆ విద్యాబలమున నీవు విశ్వకర్మ నిర్మిత మండపమును ప్రవేశింపుము. నీకును నీ పరివారమునకును నేమియు నవమానము గలుగదు. భయంబు విడువుము. మాతో వివాహమునకు రమ్ము." నావుడు దేవేంద్రాదులు భయంబు వీడి వారి వెనువెంటఁ జనుచుండిరి.

పెండ్లివారు సమీపించుచున్నా రను వార్త విని హిమవంతుఁడు పుత్ర మిత్ర కళత్ర బాంధవ పరివార జనంబులచేఁ బరివృతుండై వారల నెదుర్కొని విడిదిగృహంబునకుం దోడ్తెచ్చి యర్ఘ్యపాద్యాది విధుల సగౌరవంబుగఁ బూజించి విశ్వకర్మనిర్మితము లగు నాసనముల నాసీనులం జేసెను. అట్టి సమయమున మేనక యరుదెంచి శంకరునకు నీరాజనం బొసఁగెను. ముహూర్తం బాసన్నంబుగాఁగ శంకరుని మంగళ స్నానమునకు సంసిద్ధుని జేసిరి. సువాసినీమణులు మంగళ వాద్యంబులతో సువర్ణ కలశంబుల జలంబునుఁ గొని తెచ్చి మంగళస్నానంబు గావించి సమస్తాభరణభూషితునిగఁ జేసిరి. తదనంతరము మహేశ్వరుండు నందివాహనారూఢుండై

రాగా హిమవంతుఁడు వానికిఁ జేయూఁత నొసంగి క్రిందికి దింపి కనక పీఠంబునఁ గూర్చుండఁ జేసెను. గిరిజ సులో చనయుఁ, జంద్రరేఖాభాసురాకారయు, దివ్యరత్నాంచిత హారవిభూషితయు, నానారత్నాలంకారయు నై చెలికత్తెలు వెంటరాగా వివాహవేదికకు విచ్చేసెను. లగ్నంబుకై కొంత తడవు నిరీక్షించి శంకరుని వేదికపైఁ గూర్చుండఁ జేసి యక్షత పూర్ణంబగు నంజలి శంకరునిపై విడిపించిరి. ఈశ్వరుండు సంతోషాంబుధి మునింగెను. పార్వతియు దుర్ఘట తపంబునఁ బడసిన పతిఁ జూచి యమందానంద యయ్యెను. ఆదాంపత్య మభినందింపని వా రెవరును లేరు. అందఱును మహాసం తోషాంతరంగులైరి.

గర్గప్రేరితుండై హిమవంతుఁడు కరంబునఁ గనక కల శంబుఁ దాల్చి భార్యాసహితుండై కన్యాదానమున కుద్యుక్తుఁ డయ్యెను. అప్పుడు సభాసదు లందఱు శంకరుని మహిమం బులు వేనోళ్ళం బొగడిరి. గిరిపతి విధ్యుక్తధర్మంబుగ గిరీశు నకుఁ గన్యాప్రదానము గావించెను. తదనంతర మా దంపతు లను హోమగుండమునొద్దకు తీసికొని వెళ్ళి యగ్ని నాహ్వా నింప మొదలిడిరి. విధివిహితకర్మకలాపంబు నిర్వర్తించు చుండిరి. మహర్షు లార్షమతానుసారము జరుపుచుండిరి. అట్టి సమయమున వారలలో వారికే పరస్పర వాక్కలహం బులు పొసంగెను. ఊరకుండినఁ బ్రమాదము కలుగు నని తలంచి నారదుఁ డది గని వారించి కలహంబు నాపి యథా విధికృత్యముల నెఱవేర్పించెను. ఇట్లు శివవివాహమహోత్స వము సంపూర్తిం గావించెను. వేదికపైన నున్న దంపతులకుఁ

బుణ్యాంగనానివహంబు నీరాజన మొసంగి మంగళగాన మొనర్చి లేవనెత్తిరి. ఇవ్విధమున వివాహము పూర్తికాఁగా వివాహాగతు లొక్కచోఁ జేరి భుజించుచు నొండొరులతో నెక్కసక్కియము లాడుకొనుచు పరమానందమునఁ గాల క్షేపముఁ గావించిరి. వివాహాగతు లగు నెల్లరకు భక్తిపూర్వ కంబుగఁ గానుక లొసంగి తగురీతిఁ గారవించిరి. అంత శివుండు గౌరీసహితుండై బయలుదేరుటకు సిద్ధమయ్యెను. అప్పుడు హిమవంతుఁడు పార్వతిచేతిని బరమేశ్వరుని హస్తమునం దుంచి బాష్పకలితాక్షులతో గద్గదకంఠుఁడై యిట్లనియె: "శంకరా! ఈమె నా చిన్నారి తనయ. కడుంగడు నమా యకురాలు. పెద్దలయెడ సంచరించు విధమును గూడఁ దెలి యని ముగ్ధ. అట్టి యీమెయెడ నీవు పరిపూర్ణ కటాక్ష ముంచి కాపాడవలయు. ఈమెను నీవు విధివిహితంబుగఁ బూజింపఁ జేసికొను" మని విన్నవించుచుఁ గూఁతు నల్లుని గొంతదవ్వు సాగనంపి మగుడి తన నివాసముఁ జేరెను. ఆ జగత్పితలను గంధమాదనపర్వతమున వీడ్కొని దేవత లందఱు తమ తమ నివాసములకుం జనిరి.

పార్వతీపరమేశ్వరులు గంధమాదనమున సుఖంబున నుండిరి. కొంతకాలమునకుఁ బార్వతి గర్భము ధరించెను. దేవతలు తమ బాధలు తొలఁగిన వని సంతోషించుచుండిరి. వారల పీడా విముక్తుల గావించుటకుగాను నొక కుమారుఁ డుదయించెను. ఆ జనించిన బాలకున కారు మొగంబు లుండుటచేత షణ్ముఖుం డనిరి. ఆతఁ డుదయించునప్పుడు దేవతలు పుష్పవృష్టి గురిసిరి. దుందుభులు మ్రోఁగెను.

ప్రమథగణంబునకుం గల యుత్సాహమునకు మేర లేదు. జననీజనకులు కుమారునిం జూచి మోదంబును నొందిరి. ప్రమథగణంబు తమ చిన్న దొలికకుఁ గానుక లొసంగిరి. అబ్బాలుఁడు దినదినాభివృద్ధిఁ గాంచుచుండెను. శంకరుం డా బాలునిఁ జేరందీసి చుబుకంబు దువ్వి ముద్దులాడు చుండును.

షణ్ముఖుండు యుక్తవయస్కుఁడు కాఁగనే శివుండు వానిని దేవసేనానిగ నియమించెను. రాక్షసు లందఱు భయపడిరి. నిర్భయులై దేవతలపైఁ బడు రాక్షసు లిప్పుడు వెనుకంజ వేసిరి. తారకాసురుని దుండగములు మాత్రము తగ్గుట లేదు. కొంతకాలమునకు దేవదానవసైన్యములు తలపడెను. ఆ సమరంబున షణ్ముఖుండు భయంకరాకారము దాల్చి తన యమోఘ శక్తిని సర్వలోకభయంకరుఁ డగు తారకాసురుని వధించి దేవతలకు మహోపకృతి ఘటించెను. దేవతలు తమ బాధల నీఁగి సుఖంబున నుండిరి.

ఒకానొక దినమునఁ గలహప్రియుఁ డగు నారదుఁడు శివదర్శనార్థముఁ గైలాసమునకుఁ బోయెను. ఆతఁడు మార్గ మధ్యంబున ననేక చిత్రవిచిత్రంబు లగు దృశ్యములం గాంచుచు శివమందిరద్వారముకడకుఁ బోయి యచ్చట విశ్వకర్మనిర్మితములై ద్వారమున కిరుగెలంకుల నిలిచియున్న చిత్రప్రతిమలం గని నిజద్వారపాలకు లని భ్రమించి లోనికిఁ బోవ ననుజ్ఞనీయుఁ డని వేఁడ వారలు నిరుత్తరులైనఁ గృత్రిమ ద్వారపాలకులుగా నెఱింగి లజ్జితుం డాయెను. తరువాత నారదుండు లోనికిఁబోయి గౌరీశంకరులనుఁ గని సాష్టాంగ

నమస్కారము లొనరించెను. అంత శంకరుండు వాని యాగమన కారణ మెఱింగింపు మనిన నారదుం డిట్లనియె : "ఓ పరమేశ్వరా! మీ యుభయుల దయాతిరేకంబునను మదీయ పుణ్యావిశేషంబునను మిమ్ములం గాంచగల్గితిని. భవదీయ సందర్శనవాంఛాపరాయణుండనై చనుదెంచితి. మీరలు క్రీడాపరులై చరించుచున్నప్పుడు చూచి మదీయజన్మము సార్థకము గావించుకొనఁ గుతూహలాయత్తచిత్తుండనై విచ్చేసితిని. ఇదియే నాయాగమనకారణంబు." నావుడు పార్వతి "బ్రహ్మపుత్రా! నీ కెయ్యది వాంఛితమో యెఱింగింపుము. దానినాడి నిన్నానందపరవశునిం గావించెదము" అనిన నారదుండు "జగన్మాతా! ద్యూతక్రీడ మనోహరముగా నుండు నని నా మతంబు. మీరలిరువు రద్దాని నాడినచో నదిగాంచి సంతసించెద" ననెను. అంత పార్వతి యిట్లనియె: "బ్రహ్మపుత్రుండవయ్యు నిట్టి నీచకార్యంబు సేల తలఁచితివి. జూదముకంటె నీచకార్యము మఱొండు లేదు. దీనినాడినవార లష్టకష్టములపా లగుదురు. ఎట్లయినను భక్తుల మనోవాంఛితములు నెఱవేర్పక తప్పదు. కావున నీ మనోభీప్సితము నెఱవేర్చెదము. చూతువుగాక."

నారదుని మధ్యస్థునిగ నియమించి పార్వతి సారెలం దెచ్చి ద్యూతఫలకంబున నిడి శంకరునితో నాడఁదొడంగెను. నారదుఁడు మహానందముతోఁ జూచుచుండెను. ఆ దంపతు లిరువురు నన్యోన్య జయాభిలాషులై తమ కౌశలంబునుఁ జూపుచుండిరి. కొంతతడవునకుఁ బార్వతి యపజయముఁ గాంచెను. అంత నీశ్వర నారదు లామెను గేలి చేసిరి.

తనకుఁ బందెమున నోటమియు వారల గేలిసేఁతయు సహింప
రామి గౌరి మఱల ద్యూతమునకు శంకరుని బ్రారంభింపు
మనియెను. ఈసారి తప్పక తాను గెలుతు నని పార్వతి
నుడువ తానే జయముగాంతు నని శంకరుండు పలికి తన
సమస్తము నొడ్డెను. వారిరువురు నక్షవిద్యానైపుణ్య
మును జూపుచుండిరి. పార్వతి మిక్కిలి పట్టుదలతో నాడి
శంకరుని బరాజితుఁ గావించెను. శివుని సర్వస్వము పార్వతి
గెల్చుకొనెను. ఆతని కంఠహారం బగు వాసుకిని, శిరోలం
కార మగు చంద్రకళిక, గట్టుపుట్టం బగు గజాజినమును,
భుజంగమయసర్వాలంకారములను నూడఁబెఱికిన నతఁ
డచ్చోటు వీడి వనములం బడి పోయెను. కలహప్రియుఁ డగు
నారదుఁడు లోలోనఁ బొంగి గౌరి మది నెఱిఁగి ముదలఁగొని
తనదారిం బోయెను.

శర్వాణి తన నాథుండు వనములపా లగుటచే మన
శ్శాంతి తప్పి పిచ్చిదానివలెఁ జరించుచు జింతాకులస్వాంతయై
దుఃఖించుచుండెను. అట్టియెడ సఖీజనంబు లామెతో నిట్లనిరి:
"పార్వతీ! నీవు పెక్కు ప్రయాసల కోర్చి తపంబు గావించి
పొందిన భర్త నిన్నుఁ దృణీకరించి పోవుచున్నప్పుడు
చూచుచు నూరకుంటివి. ద్యూతక్రీడయే యిట్లు ఫలించినది.
అయ్యకార్యం బొనర్చి యిట్టి యిక్కట్టుల పాల్పడితివి.
నీయంతటి మూర్ఖురాం డ్రుండరు. భర్త జూదంబున నోడినంత
మాత్రమున వాని యాభరణములు తీసికొనవలయునా? ఇప్పు
డైనను పోయి యమ్మహామహుని పాదములం బడి ప్రార్థించి
మగిడి తీసికొనిరమ్ము. పొమ్ము." అని చెలియలు పలికిరి.

ఒకదినమున పార్వతి యేరికిం జెప్పక భిల్లాంగన వేషము ధరించి కరంబున శరాసనంబుఁ దాల్చి పరమేశ్వర సందర్శనార్థము వెడలెను. ఆపె శాంబరీవేషము ముల్లోకములను మోహింపఁ జేయునట్టిదిగ నుండెను. ఆమె యరణ్యమును బ్రవేశించి యెట్టకేలకుఁ బరమేశ్వరునిం గనుఁగొనెను. రుద్రుఁ డామె యాకారమునుఁ జూచి మోహాచిత్తుం డాయెను. నెమ్మదిగ నాతఁ డామె నెమరొ్కని యిట్లనియె: "ఓచిన్నదానా! నీదేయూరు? ఇచ్చటకు రాఁగతంబేమి? నీ సౌందర్యము నన్ను మదనాగ్ని కెఱఁజేసినది. నన్ను వరింపు" మనవుడు పార్వతి చిరునగవు నగుచు వాని కిట్లనియె: "ఓ మహాత్మా! నీవు కడు తపశ్శాలివి. ఇట్టి నీవు పురాంగనను బలాత్కరింపఁ దగునా? నీకు నేను భార్య నగుటకు సమ్మతించెదను. కాని పూర్వము ఘోరతపం బొనరించి నిన్ను కామించిన కామినిని విడిచిపోయినట్లు నన్నును నీవు విడుతువేమో యని భయమగుచున్నది. నిన్ను నమ్ముటకు వీలులే"దనిన నాతఁ డామెను గరంబుపట్టి వినయపూర్వకముగఁ బ్రార్థించెను. ఆమెయు వల్లె యనుచు "నీవు నన్నుఁ బరిణయంబాడఁ గోరెదవేని మదీయజనకుని పాలి కరుగుదెమ్ము. ఆతం డిష్టపడినచో నన్ను పరిగ్రహింతువుగాక. రమ్ము." అని కైలాసంబునకుం దీసికొనిపోయి నిజసంగతి తెల్పి యథాస్థితిఁ బూజించెను. ఇట్లు పార్వతి మగుడి తన భర్తను బడసి కైలాసంబునఁ బ్రమథగణావృతయై సుఖంబుండెను.

# 6. గరుత్మంతుఁడు

కశ్యప ప్రజాపతి కిరువురు భార్యలు కలరు. వారలు కద్రూ వినతలు. వారలకు సంతానము లేకుండెను. కశ్యపుఁడు పుత్రార్థియై పుత్రకామేష్టిఁ గావించెను. ఆ యాగంబునకు సకలమునిగణంబును దేవేంద్రుఁడును విచ్చేసిరి. కశ్యపాజ్ఞను దేవేంద్రుఁడును, ఋత్విజులును సమిధలం గొని తెచ్చిరి. అంగుష్ఠమాత్రు లగు వాలఖిల్యులుఁ దమ యోపినకొలఁది నింధనములం దెచ్చిరి. వారలు దెచ్చునది మిక్కిలి స్వల్ప మని యింద్రుఁడు వారిం జూచి నగెను. అంతట వారలు కోపారుణిత లోచనులై వానిం జూచి యిట్లనిరి : "ఓయీ! యింద్రా! నీతో సమానులు లేరని మిక్కిలి విఱ్ఱవీఁగుచున్నాఁడవు. నీకు మేము పరిహాసాస్పదులముగాఁ గనిపించుచున్నారము కాఁబోలును. నీతో సమానులున్నచో నీవిట్లు మదాంధుఁడవై యుండవు. కావున నీ యాగంబున వీరాగ్రేసరుండును, రణ విజయుండును నగు మహానీయుం డొకఁ డుదయించి రెండవ యింద్రుం డగును. దానంగాని నీకు శృంగభంగము కా"దని వీర్యవంతము లగు మంత్రములను జపించుచుండిరి. దేవేంద్రుఁడు భయకంపితుఁడై కశ్యపప్రజాపతియొద్దకుఁ బోయి యిట్లనియె : "ఓ కశ్యపప్రజాపతీ! నీ యాగమూలంబున నా దేవేంద్రత్వము భ్రష్టతము గానున్నది. అజ్ఞానమున మునీంద్రుల నవమానించితిని. వారల శాపానలమునుండి కాపాడు"మని జరిగిన యావద్వృత్తాంతముఁ దెలియఁజెప్పిన కశ్యపప్రజాపతి వాలఖిల్యాదులం గని యిట్లనియె: "ఓ మునీం

ద్రులారా! సృష్టికర్త యగు బ్రహ్మ కతన సకల చరాచర భూతంబు లుద్భవించెను. ఆతఁడు దేవేంద్రుని వానికి బ్రభువునుగా నియమించెను. నాకుఁ గలుగఁబోవువాఁడు రెండవ యింద్రుఁడైనచోఁ బ్రపంచవిరుద్ధ మగును. మీ వాక్యంబు లమోఘంబులు. వానింద్రిప్పుట కేరికిని సాధ్యంబుఁగాదు. కావున మీ వచనములప్రకారము నాకుఁ గలుగువాఁడు పక్షీంద్రుఁ డగున ట్లనుగ్రహింపుఁ"డని ప్రార్థించిన వారలు వల్లె యనిరి.

యాగానంతరము కశ్యపప్రజాపతి తన భార్యల నిర్వురం బిలిచి వారలకుం గావలయు వరంబులం గోరుకొనుఁడనెను. కద్రువ తన కాదిత్య తేజు లగు వేవురు పుత్రులుఁ గావలయుననిఁ గోరెను. వినత బహు పుత్రుల వలన లాభము లేదని యెఱింగి లోకవిఖ్యాతిగాంచు పుత్రుఁ డొక్కఁడైనను చాలునన్న మతమున సకలగుణగణాఢ్యులును, తేజోబల సమన్వితులును, సకల భూత చరాచర ప్రపంచ మంతయుఁ దమ యశశ్చంద్రికలచేఁ బ్రకాశింపఁ జేయఁగలుగువార లును నగు నిరువురు కొడుకుల ననుగ్రహింపుఁ డని ప్రార్థించెను. కొలఁది కాలమున వారల కిరువురకును గర్భచిహ్నంబులు గాననాయెను. నవమాసంబులు నిండిన కద్రువ గర్భంబునుండి వేయి యండంబు లుదయించెను. ఆ యండంబుల నూతన భాండంబులం బెట్టి వానియందు గోఘృతంబు నునిచి రక్షించుచుండెను. వినతకు గర్భము పండి రెం డండము లుదయించెను. వినతయుఁ దన యండ ద్వయంబునుఁ గాపాడుకొనుచుండెను. ఏనూరేండ్లకుఁ

గద్రువ యండంబులనుండి క్రమంబున శేషవాసుకైరావ తాదులు వేవురుదయించిరి. ఈ సంతానము నానావిధ సర్ప జాతులకు ముఖ్యనాయకత్వము వహించెను.

వినతయుఁ బుత్రసంతాన ముదయింప మిక్కిలి యాతురతతో నుండెను. కాని యెన్ని సంవత్సరములు వేచి యుండినను నండములు విరియుటలేదు. ఆమె కడు ఖేదమున ధైర్యమునుఁ గోలుపోయి యొక గ్రుడ్డునుదీసి చిదిపెను. అం దంగవిహీనుండును గురూపియు నగువాఁ డొకఁ డుండెను. అవయవస్ఫూర్తికామి కందున్న బాలుఁడు తల్లి తన్ను సకాలమువఱకు వేచియుండక పగులఁగొట్టినందులకు మిక్కిలి కోపించి యామె కిట్లనియె: "జననీ! నీ సవతికడుపుపంట కీసుగలిగి నీ వాతురతచేతఁ దెలివిలేమిచేత నన్నిట్లర్ధశరీరునిగ నండ మవియించితివి. దానంజేసి నీవు నీ సవతికి దాసివగుదువు గాక. ఇదియే నీకుఁ బ్రతిఫలము. నీ రెండవ యండంబు నైనను జాగరూకతతోఁ గాపాడుకొనుచుండుము. అందుద యించువాఁడు మహాబలసంపన్నుఁడు. అతఁడే నీ దాస్య విమోచనము గావింపఁ గలఁడు." అని చెప్పి తల్లికి నమస్కా రంబు లాచరించి యాతఁడు సూర్యరథసారథిగా మింటి కెగసిపోయెను. ఈతఁడే యనూరుఁడు. తొడలులేనివాఁడు గాన ననూరుం డను నామము సార్థకమాయెను.

కద్రువ మనోగమనమున కాఱుమబ్బులు గ్రమ్ము చుండెను. ఆపెమోహమున మోసంపు మెఱుపులు తళుకు మనుచుండెను. అమాయకురా లగు వినత దానిని గనుగొనఁ జాలకపోయెను. ఏకారణముననో కాని కద్రువ వినత నెప్పు

డెడఁబాయకుండెను. ఒకదినమున సవతులిరువురు వినోదా ర్థము విహరించుట కొక సముద్రతీరవనమునకుఁ బోయిరి. తరంగములనుండి వచ్చు చల్లని పిల్లవాయువులు మిక్కిలి విశ్రాంతిని గలిగించుచుండెను. తమనిలిచిన యుద్యానవన మందలి నానావృక్షంబులు పుష్పలతాదులు పరిమళముఁ గొల్పుచుండెను. వారత్తావున సంచరించుచు నానంద మునుఁ బొందుచుండిరి. వారలకు నేత్రముల కానందముఁ గొలుపు నొక యశ్వరాజంబు దవ్వుల గాన్పించెను. చూచి నంతనే కద్రువ తనకు సమయము చేకూరిన దని తలఁచినది. "ఓచెల్లెలా! ఆయశ్వంబుఁ జూడుము. దాని ధావళ్యం బేమనవచ్చును. కాని వాలంబునఁగల నీలంబు దానిసౌందర్య మున కొక కళంకుఁ దెచ్చినది. ఇది కలువలతేనియందలి కందువలె నున్న"దనవుడు వినత "అక్కా! అది యుచ్చైశ్శ్రవము. దానియందు నలు పెక్కడిది? నీచూపు నందు దోషం బుండవచ్చును. మహాపురుషకీర్తియుంబోలె నిర్మలంబైయున్న దానిమేన నీలిమ గల్గునే యని తెమలఁ బలికెను. కద్రువ యదిసహింపక వినత కిట్లనియె: "ఓ వినతా! దానితోక నలుపువర్ణముఁ గలిగియుండనిచో నేను నీకు దాసి నయ్యెదను. లేనిచో నీవు నాకు దాసివిగమ్ము! ఈదాసీత్వము జన్మాంతరమువర కుండవలయును జుమీ! చలువుము పందెము." నావుడు వినత వల్లె యని కద్రువ నశ్వసమీపం బునకుఁ బరీక్షార్థము రమ్మనెను. మోసముచేయనెంచిన కద్రువ కామాటలు రుచింపవయ్యెను. ఆమె కాలయాప నముఁ జేయనెంచి మఱుసటిదినమునఁ జూడవచ్చు రమ్ము

నేటికిఁ బతిసేవకు వెడలుద మని చెప్పి వినతను గృహంబు నకుఁ దోడ్కొనిపోయెను.

కద్రువకుఁ దాను దలఁచిన కార్యము నెఱవేరునా! లేదా! యను తలంపు హృదయమును వేధించుచుండెను. హృదయవేదన వలన ముఖవికాసముఁ దప్పెను. కద్రువ మహావిపత్సముద్రమం దున్నదానివలె నుండెను. ఆమె డోలాయమానమానసయై ఆరాత్రి కుమారుల జేరంజీరి యిట్లనియె : "కుమారులారా! మీ క్షేమమునకై యొక పన్నుగడ పన్నితిని. మీకు రానున్న యపాయము తొల గించు బాధ్యత నాయం దున్నది. మీకు రానున్న యాపద యేమన నేనును మీ పినతల్లి యగు వినతయు సంతానవిహీనల మైతిమి. అప్పుడు మీ తండ్రిదగ్గఱకుఁ బోయి సంతాన భిక్ష పెట్టు మంటిమి. నేను వేయిమంది పుత్రులం గోరితిని. వినత మిమ్ముల మించు పరాక్రమవంతుల నిరువురఁ గోరెను. ఇట్టి పుత్రులఁ బడసి మిమ్ముల నణఁగఁ ద్రొక్క వలయు నని యామె తలంపు. దానికి నేను బ్రతీ కారముఁ దలఁచితిని. అప్పటి నుండియు నా కామెపైఁ గోపము. దాని ప్రథమ పుత్రుం డనూరుం డగుట నాకుఁ గోపము కొంత యుపశమించినది. రెండవ యండం బవియ సిద్ధముగా నున్నది. అం దుద్భవించువాఁడు మిమ్ముల బాధించును. వాఁడు బయల్వడుటకు మున్నె యే యుపాయమువలననైన వినతను దాసిగఁ గొనవలయును. మాతృదాస్యమునందు జనిం చిన పుత్రుఁడును దాసుఁడే యగును. తన్మూలంబున నాతఁడు కూడ మనకు సేవఁ జేయఁ గలఁడు. అందువలన మీ కాప

దలు కలుగవు. ఆమె నెట్లయిన దాసిఁ జేయ నుంకించు చున్నదాన. అందులకై వినత నెడఁబాయక తిరిగితి. ఆమెను దాసినిఁ జేసికొనగలుగు తరుణము నేఁడు చిక్కినది. సాయంసమయమున మే మిరువురము సముద్రతటంబున విహరించుచుండి యింద్ర హయంబునుఁ జూచి నేను దాని తోఁక నలుపు వర్ణము కలిగియున్నదని నుడివితిని. దాని కామె తెలుపని వాదించినది. అంతట నోడిపోయినవారు గెల్చినవారి కాజన్మాంతము దాసిగా నుండునట్లు పందెములు చఱచుకొంటిమి. ఉచ్చైశ్శ్రవ మతి ధావళ్యం బని యెఱుంగుదును. మీ సహాయమువలన దాని వాలంబు నలుపు గావలయు. మీయం దొక్కరుఁడు పోయి దాని తోఁక నంటుకొని యుండిన వినత యోడిపోవును. మన కామె దాసి యగును. మే మిట్టి మోసపు కృత్య మెట్లు చేయఁగల మని తలఁప వద్దు. బుద్ధిమంతులగువారు తమ కార్యములను చతుర్విధోపాయములఁ జక్కఁ జేసికొనుదురు. కావున రేపు మే మచ్చటి కరుదెంచు నప్పటికి మీయం దొక్కఁడు పోయి నా వాంఛ నీడేర్పుఁడు. ఇది మన కెల్లరకు శ్రేయస్కరము. మీ యందలి వాత్సల్యమే నన్నీ కృత్యమునకుఁ బ్రేరేపించిన"దని సవిస్తరముగఁ జెప్పెను.

అంతటఁ గుమారు లంద రొక్కపెట్టున నిట్లనిరి: "అమ్మా! నీకు మాయం దిట్టి వాత్సల్య ముండుట సాజము. దానికి మేము కృతజ్ఞలము. సత్యసంధురాలు నమాయికయు నగు మా పినతల్లియెడ నిట్లు సంచరించుట నీకును దగదు. ఆమె మమ్మెపుడు తూలనాడియైన నెఱుఁగదు. మమ్మామె

దయతోఁ జూచుచుండును. మమ్ములమించు కుమారులం గోరుటలో దురభిప్రాయ మేమియును లేదు. నీవు మా శ్రేయో భిలాషిణి వగునట్లు వినతయు తన పుత్రుల శ్రేయస్సు నభిల షించుట దోషమా? ఆమెకుఁ గలుగఁబోవువాఁడు మా సహోదరుఁడు గాఁడా? మమ్ములమించిన తమ్ముఁడు కలిగినందులకు సంతసింతుము. లేనిపోని దురభిప్రాయములం బెట్టికొని కలఁతఁ జెందకుము. నీవు మాకు బోధించున దధర్మ మార్గము. అధర్మ మని తెలిసియుఁ బ్రవర్తించినచోఁ బాపాన లమునఁ బడవలయును. ఇట్టి ధర్మవిరుద్ధకృత్యమును జేయఁ జాల''మనినఁ గద్రువ కోపోద్దీపితమానసయై వారల కిట్లనియె: "ఓ శుంఠలారా! మీకుఁ బ్రపంచజ్ఞానము లేశమైనను లేదు. సవతితమ్మున కాధిక్యత నిచ్చునట్టి మూఢుల రగు మీ తెలివి ప్రశంసనీయము. మీరు నేను నియమించిన కార్యముఁ జేయకున్న జనమేజయుఁడు చేయనున్న సర్ప యాగమున కాహుతి యగుదురుగాత''మని శపించెను. కాద్రవేయులం దొక్కఁడుదక్కఁ దక్కినవారలు చావునకై పను సంసిద్ధులైరి. కాని యక్రమప్రవర్తన కొడఁబడకుండిరి. తల్లిశాపము తగిలితీరు నను భయమునఁ గర్కోటకుండును నతఁడు తల్లిపంచిన రూపంబున నుచ్చైశ్శ్రవంబు వాలంబు నీలంబుగా దానింబట్టి వ్రేలాడుచుండెను.

కద్రూవినతలు తెపకడలేచి తాము పంతము లాడు కొనిన తావుకడకుఁబోయి యశ్వంబును బరీక్షించిరి. ఆతురం గంబు వాలంబు నీలంబుగ నుండుటఁగని వినత యోటువడితి నని యంగీకరించెను. ఆమె నిజముగ నలుపు వర్ణమే

యని తలంచెను. అది కద్రువకుటిలత్వ మని యెఱుఁగదు. వినత దాసి యయ్యెను. కద్రువ తన మనోరథ మీడేరె నని కడుంగడు మోదంబు నొందెను. సమాన మగు సవతుల స్థితియందు భేదము కలిగెను. ఇప్పు డొకర్తుక ప్రభ్వి. ఒకరుత దాసి. వినత కద్రువమనోవాంఛితము లీడేర్పవలయును. అణఁకువ కలిగి మెలఁగవలయును. నియోగించిన కృత్యము లేమరక చేయవలయును. తన మనోవాంఛల నణఁగఁ ద్రొక్క వలయును. అది జీవములేని శరీరము. ఉచ్చనీచము లెఱుఁ గని కీలుబొమ్మ. దాస్యముకంటె వేఱు ఘోరనరకము గలదా ? కద్రువ వినత నెల్లవిధములఁ బీడించుచుండెను.

ఇట్లు పంచశతవర్షంబులునిండ రెండవ యండం బవిసెను. అందుండి విశాలపక్షములు గలవాఁడును, గురుతర జవసత్త్వ సంపన్నుఁడును, మార్తాండుని ధిక్కరించు తేజము గలవాఁడును, నజేయుఁడును నగు నొకపక్షిరాజ ముద్భ వించెను. ఆతఁడు జనించిన తక్షణంబున బృందారక బృందం బులు నుతిసేయుచుండ నంతరిక్షమున కెగసెను. అసమాన దివ్యతేజుం డగు కుమారునిగాంచి వినత యానంద సముద్ర మున నోలలాడుచుండెను. వానికి గరుడుం డని నామకరణం బొనరించిరి. గరుడుం డురుతరజవంబున నరుగుదెంచి తల్లికిఁ బ్రణమిల్లెను. మహాతేజశ్శాలి యగు వైనతేయుఁజూచి కద్రువ సహింపనోపక వాని కిట్లనియె: "ఓ గరుత్మంతుఁడా! నేఁ డాదిగా నీ వనవరతము నా పుత్రులను మోయుచు వారల నాడింపుము. నే నాజ్ఞాపించు పనులను సక్రమమున నెఱవేర్చు చుండు" మని నిర్బంధించెను. వైనతేయుండును వినత యను

మతి ననుసరించి కద్రువ నియోగించిన కృత్యములను జేయు చుండెను. కాద్రవేయులు వైనతేయు నతిగౌరవంబుగఁ జూచుటఁ గని తల్లి వారలను మందలించి వాని నతినీచముగఁ జూచునట్లు చేయుచుండెను. ప్రథమమున రుచింపక పోయి నను దల్లి దుర్బోధలుఁ గ్రమక్రమమున వారలకుఁ దల కెక్కెను. నాగులును వానిచే నూడిగములు గొనఁ బ్రారంభించిరి. ఖగేశ్వరుఁడు పన్నగముఖ్యులఁ దన వీఁపున బెట్టుకొని విపినంబులను, సమస్తద్వీపంబులను, గిరులనుఁ జూపు చుండును.

ఒకదినమున ఖగేంద్రుండు పన్నగంబులఁ దనపక్షముల నిడుకొని గగనమండలంబున కేఁగెను. వార లతనిని మఱియుఁ బ్రోత్సహింప మార్తాండమండలంబున కెగసె. కాని చండభాను చండకిరణంబుల వేడిమికిఁ దాళఁజాలక గరుడుని వీఁపుననున్న పన్నగములు నేలంబడి మూర్ఛిల్లెను. అదిగాంచి వైనతేయుండు వైళంబ భూమికిఁ బ్రాలి వారల కుపశాంతి కలుగునట్లు పక్షంబులచే వీచుచుండెను. ప్రాణంబులు కడయంటినవి. గరుడుండు చేయు నుపచారము వలన చైతన్యము కలుగలేదు. కద్రువ ఖిన్నవదనయై గత్యంతర మాలోచించెను. సూర్యప్రచండకిరణములచే నిస్పృహ జెందినవారలకు రక్షోదకమే మహాప్రసాద మని యెఱింగి పర్జన్యు నారాధించెను. ఇంద్రుండును వారలపై దయఁగొని వర్షంబు గురిపింపఁ గాద్రవేయులు విగతపరితాపులైరి. వారలు సజీవులగుటఁ గద్రువ విని మిక్కిలి సంతోషించెను. వారలు గతజీవులైనచో నానింద తనమీఁదఁ బడు నని గరుడుఁడు

భయపడెను. కాని కద్రువ గరుడుని గడు దుర్భాష లాడి నీచకృత్యములకై వినియోగించుచుండెను.

కద్రువ నియోగించు కృత్యము లన్నియు దుస్సహముగ నుండెను. ఒక దినమున వైనతేయుఁడు వినతంగాంచి యిట్లనియె: "ఓ జననీ! గురుతరపక్షములు గల్గి శైలంబుల సహితము నుఁగావింపఁగల నాకు నీ పాముల మోయవలసిన యగత్యమేమి? కద్రువ యాజ్ఞాపించు పనులం జేయఁజాలను. ఏ కారణమున నీకును, నాకును నూడిగము చేయవలసివచ్చెనో సెలవి''మ్మనిన వినత జరిగిన యుదంతమంతయు వక్కాణించెను. అంతట గరుత్మంతుఁడు రోషానలుండై నిజజననితో నిట్లనియె: "ఓ తల్లీ! వారలు నిన్ను మోసపుచ్చిరి. ఉచ్చైశ్శ్రవ మెచ్చట? నీలవర్ణ మెచ్చట? కపటంబున నిన్ను వారలోడించినవారలు. నిన్నిట్లు మాయచే నోడించినవారలం జంపినను దోషంబులేదు. "ఆర్జవంహి కుటిలేషునసీతి'' యనుట వినవే. వారలనెల్ల నిప్పుడు యమసదనంబున కనిపెదను. అధర్మ మెంతకాలము నిలుచును.'' అని వారలఁ జంప నుంకించుచున్న కుమారుని వారించి తల్లి యిట్లు పలికెను: "నాయనా! నీవు వారలఁజంప సమర్థుఁడవు. కాని నీ కది తగదు. అపకారుల కుపకారము చేయువాఁడే బుద్ధిమంతుఁడు. నీవు నాదాస్యవిముక్తిం గలుగ వెరవు నాలోచింపుము. అనూరుండు నీవలన నా యీ దాస్య మీఁగఁగల దని చెప్పియున్నాఁడు. నిరంతరము శోకస్థితియందున్న నా దాస్యమునుఁ బాపుము. ఇదియ పదివేలు మన" కనియె.

ఖగేంద్రుండు కాద్రవేయులం జేరి "ఓయన్నలారా! మా యీ దాస్యముం బాయు నుపాయ మేదియైనను జెప్పుఁడు. మీకుంగావలయు నేవస్తువునైననుఁ దెచ్చి యిచ్చెద. సాధ్యాసాధ్యంబులతోడ మీకుం బనిలేదు. అజేయు లగు దేవతలనైనం జయించి మీ యిష్టం బొనగూర్తు. సెలవిం"డనవుడు వారలు తమతల్లితో నాలోచించుటకుఁ బోయిరి. కద్రువయు వారలతో నిట్లు పలికెను: "ఓ తనయులారా! గరుడుఁడు మనకు లోఁబడువాఁడు కాఁడు. అతఁడు మనకు దాస్యముఁ జేయననినచో వానిని మన మేమియుఁ జేయఁజాలము. నిజజనని దాస్యవిమోచనము చేయ బద్ధకంకణుండై యుండును. కావున వానివలన మనముఁ బడయ గలుగు వస్తు వొకటి గలదు. అది యేదన నమృతము. అమృతము తెచ్చుట సాధ్యముగాదు. దానికొఱకై యింద్రునితోఁ గలహించును. వాఁడక్కలహమున మడియును. అప్పుడు మనము నిర్భయులమై మనవచ్చును. అతఁడొకచో నమృతముఁ దెచ్చిన మనకు మఱియు మేలు. అమృతపాయుల మగు మన కేరివలన గూడ భయంబుఁ గలుగదు. ఎట్లయినను మనకు క్షేమమే." అని జెప్ప వారలు దాని కియ్యకొని ఖగేశ్వరుని యమృతముఁ దే నాజ్ఞాపించిరి. విహగేంద్రుండును సంతసంబున దాని కొడంబడెను.

ఈ వృత్తాంతమును దల్లికి నివేదించి యామెకుఁ బ్రదక్షిణముఁ గావించి సెలవొసంగు మనెను. అంత తల్లి వానిని వాత్సల్యమునఁ గౌఁగిలించుకొని వాని నిట్లు దీవించెను: "ఓ కుమారా! నీ పక్షయుగ్మం బనిలుండును, వీఁపున జంద్రుండును, శిరస్సున నలుండును, దేహంబునంతయు

సూర్యుండును గాచుచుండురుగాక ! నీ మనోభీప్సితంబు లీడేరును. పొమ్ము" నావుడు విహగపుంగవుం డిట్లు వక్కాణించెను : "అమ్మా ! అమృతహరణంబున దేవతలతో ఘోరరణంబు వాటిల్లును. దానికిం దగు లావు కావలయును. నే నిప్పు డాకలిచే డస్సియున్నాఁడను. ఆహారము లేని దే బలము కలుగదు. కావున నాకుఁ దగిన యాహారము కల్పింపు" మన " ఓ గరుఁడా ! నీ కాకలితీఱు తెఱ వొక్కటిఁ జెప్పెద. మార్గంబున సముద్రమధ్యమున కొన్ని దీవులు గలవు. అందు నిషాదు లను జాతివారు నివసించుచున్నారు. వారు పరమ దుర్మార్గులు. పరధనాదులం దోఁచికొని మదించి యున్నవారలు. వారలలోఁ గొందఱు ధర్మపరాయణులు గలరు. వారలను విడిచి మిగిలినవారల నాహారంబుగఁ గొను"మని చెప్పి కుమారు నమృతమునకై బంపెను.

గరుత్మంతుఁడు కుతూహలాయత్తచిత్తుండై పోవు చుండెను. చనుచు సముద్రోదరంబున నున్న సహస్ర సంఖ్యాకు లగు నిషాదులను బాతాళవివరముం బోలిన తన కంఠబిలంబునుం దెఱచి యందఱ నొక్కపెట్టున మ్రింగెను. అట్లు మ్రింగు నెడ నాతని కంఠబిలమున గాలమువలె నొకఁ డడ్డుపడెను. తల్లిజెప్పిన విధమున నాతఁడు ధర్మాచార పరాయణుం డని యెఱింగి వానిని గ్రక్కివేసెను. వాఁడును వెలువడి గరుడుని దీవించి యథేచ్ఛం జనెను. గరుడుండును గగనమున కెగసి గంధమాదనపర్వతంబునఁ దపంబుఁ గావించుచున్న జనకునకు సాష్టాంగనమస్కారము లొనర్చి తాను దన జనని దాస్యవిముక్తికై యమృతార్థ మరుగు

చుండె నని చెప్పిన కశ్యపుండు వానిం గాఢాలింగనముఁ గావించి చుబుకంబుదువ్వి ప్రేమపూర్వకముగ నిట్లుదీవించెను: "కుమారా! నీవు చేయనున్నది సత్కార్యము. మహేంద్రుండు నీకు విధేయుండగును. వాని యాయుధములు నీయెడ వ్యర్థము లగును. పోయిర" మ్మనవుడు ఖగేశ్వరుం డిట్లనియె: "ఓ జనకా! నాకాకలి మిక్కుటముగ నున్నది. నిషాదుల భుజించినను క్షుద్బాధ వీడలేదు. అమృతాపహరణమున వైరంబు నిక్కము. దానికిం జవంబుఁ గావలయును. క్షుత్పిపాసలు తీరినంగాని లావు చేకూరదు. కావున నాకట్టి యాహారమేదైనఁ జూపింపుము పోయెద" నన "కుమారా! నీకుఁ దగిన యాహారము కలదు. అవి గజకూర్మములు. సహస్రయోజన విస్తీర్ణము గల యొక తటంబున మూఁడు యోజనము లెత్తును బదిరెండుయోజనముల వృత్తంబును గలిగియున్న కూర్మంబునుఁ గలదు. సమీపవనంబుననే యాఱుయోజనంబుల యెత్తును, బదిరెండు యోజనముల పొడవును గలిగియున్న యేనుంగునుం గలదు. అవి సంతత మొండొంటితోఁ బెనంగి పోరుచుండును. వానిని నీవాహారంబుగఁ గైకొను" మనవుఁ డవి యట్లనయంబునుఁ బోరు సల్పుటకుఁ గతం బేమియో సెలవిం" డనెను.

"నీ వక్కథ వినఁ గుతూహలుండ వగుచో సవిస్తరముగా వాక్రుక్కెచ్చెద నాలకింపుము. పూర్వము విభావసుఁ డను బ్రాహ్మణుం డొండు గలఁడు. అతఁడు సుగుణ గరిష్ఠుండు. సదాచారపరాయణుఁడు. నియమవంతుఁడు. పవిత్రుండు. కాని ముక్కోపి. వానికి సుప్రతీకుం డను తమ్ముఁడు గలఁడు.

వారలకు ధనధాన్యాదులు మెండుగా నుండెను. పిత్రార్జిత మగు సొత్తు నిరువురు కలిసియే యనుభవించుచుండిరి. గృహకృత్యము లగ్రజుఁడే వ్యవహరించుకొనుచుండెను. కొంతకాలము పోయిన తరువాత సుప్రతీకుఁడు ధర్మముగాఁ దనకు రావలయు సొత్తును విభాగించి యిమ్మని కోరెను. అప్పుడు జ్యేష్ఠ సోదరుఁ డిట్లు పలికెను : 'సోదరా! సమష్టి కుటుంబములోని గౌరవము విభక్త కుటుంబమునకు రాఁజా లదు. ఇప్పుడు మన కున్న యంగబల మప్పు డుండదు. వంచకులు మనలో భేదముఁ గల్పింపఁ జూతురు. తిండి వేరైనచో తిరుగుడు వేరగును గదా! కావున విభాగము తగని పని' అనవుం డనుజన్ముఁడు 'అన్నా! అవిభక్త కుటుంబములో నున్నచోఁ బరులు మనలో మనకు భేదములు కల్పింపఁ జూతురు. నీ వపహరించుచున్నావని నాకును, నేను సంపాదించుట లేదని నీకును జెప్పి విరోధము కల్పింతురు. వేఱువడి దూరముగ నున్న నన్యోన్య మైత్రి కాటంకముఁ గలుగదు. కలిసియున్న స్వాతంత్ర్య ముండదు. విభక్తకుటుంబమున సంపాదనా కుతూహల ముండును. కావున విభాగమే శ్రేయోదాయకము. పంపకము తప్పుగా దనెను. అంత సహజముగ కోపశాలి యగు విభావసుఁడు భ్రాతవాక్యముల కలిగి వాని నేనుంగు గమ్మని శపించెను. సుప్రతీకుండును తపస్సంపన్నుండు గావున శపింప సమర్థుండు. తనకు సరియైన ప్రత్యుత్తర మొసంగక శపించిన సోదరుని కూర్మంబవు కమ్మని ప్రతిశాప మిచ్చెను. ఇట్లు సోదరు లిరువు రన్యోన్యశాపంబున గజ కూర్మములై జనించిరి. అవి తమ

పూర్వజన్మశత్రుత్వము విడువక యొకటితో నొకటి పోరు సలుపుచుండును. వానిని నీవు భుజించి జవసత్వములు గలవాఁడవై మాతృదాస్యవిముక్తికై యమృతమునుఁ గొని తెమ్ము. పొమ్ము." అని కశ్యపుఁడు పలికెను.

గరుత్మంతుఁడు గజకూర్మములున్న మడువునకుఁ జని వానిపోరును బొడఁగని విభ్రమముఁ జెంది మనోవేగంబున వానిరెంటినిం గాళ్ళతోఁ దన్నుకొని గగనవీధికిం బోయెను. వానిని భుజించుతావునకై వెదకుచుండెను. పోవుచుండ శతయోజనాయతం బగు వృక్షమొకటి బొడఁగాంచి దానిశాఖపై నిడి గజకచ్ఛపంబులం భుజింప సమకట్టి దానిపై వ్రాలెను. ఆ పాదపంబుపై గరుత్మంతుఁడు తన పాదము లూనుసరికి పెళపెళారావంబున నమ్మహాశాఖ క్రిందఁ గూల సిద్ధముగా నుండెను. ఆ శాఖ నవలంబించి తలక్రిందుగఁ దపంబొనరించుచున్న వాలఖిల్యమునిగణంబునుఁ గని యది క్రిందఁబడినచో విపత్తు వాటిల్లు నని తలంచి యక్కొమ్మను ముక్కున గఱచుకొని కశ్యపసన్నిధి కరుగుచుండెను. ఆతఁ డట్లు పోవుచుండుటఁ జూచి దేవతలు భీతచిత్తులైరి. ఇమ్మహాద్భుతముఁజూచి కశ్యపుండు నిర్వేరఁజెంది యందున్న వాలఖిల్యులను గ్రిందికి రప్పించి వారల హిమవత్పర్వతమునఁ దపమాచరింపఁ బంపెను. కశ్యపుండు "ఓ కుమారా! నీవు పోయి నిర్జనప్రదేశం బగు హిమవత్పర్వతమున వీనిని భక్షించి యా శాఖ నందు విడువు మనెను. గరుడుండును మహావేగంబునం బరచి యా నిర్జనప్రదేశంబున నత్తరుశాఖ విడిచి గజకచ్ఛపంబుల భక్షించి మహాసత్వసంపన్నుం డాయెను.

గరుడుం డధికోత్సాహమున గగనవీధి కెగయ సమకట్టి పక్షవిక్షేపముగావింప దానివలన నుద్భవిల్లిన వాయువునకు వృక్షములు సమూలముగఁ బెల్లగిలుచుండెను. ఆ మహా ధ్వనికి దేవతావర్గమంతయుఁ దిగులునొందెను. దిగ్గజంబుల మదం బడంగెను. సర్వ దిక్పాలకులభార్యలు భయమొందిరి. దేవేంద్రుని వజ్రాయుధము చేతినుండి జారెను. ఆయుధ మునకుఁగల కఱకుదనము మందగించెను. ఇట్టి మహోత్పా తంబులు పుట్టిన సురపతి బృహస్పతిం జూచి యది యేమి నిమిత్తం బని యడిగిన బృహస్పతి యిట్లనియె: "దేవేంద్రా! ఇది స్వయంకృతాపరాధము. కశ్యపుఁడు పుత్రకామేష్టి సేయునాడు వాలఖిల్యుల నధిక్షేపించినదానికిఁ బ్రతిఫల మిది. కశ్యపప్రజాపతి యజ్ఞమహిమను వాలఖిల్యుల తపో మహిమను వినతకుంబుట్టిన విహగేంద్రుఁ డమృత హరణా ర్థము వచ్చుచున్నవాఁడు. దానంజేసి యీమహోత్పాత ములు పుట్టినవి. వానిని జయింప నలవిగాదు. అయినను యథాశక్తి రక్షించుకొనుట విధియై యున్న"దని తెలియఁ జెప్పెను. కడచినదానికి దుఃఖించిన లాభము లేదనుకొని ధైర్యంబుపూని నిశాత ఖడ్గాది మహాదారుణ శస్త్రధరుల నియోగించిన వా రప్రమత్తులై నిలిచి రేయింబవ ళ్లమృతము రక్షించుచుండిరి.

ఆకాశంబుననుండి పిడుగుబడినట్లు గరుత్మంతుం డమృతకలశ మున్నచోట వ్రాలెను. అమృతపాలకులు భయంబు నొందిరి. కాని వారంద ఱొక్కపెట్టున ఖగేశ్వరుని పైఁ బడ నాతఁడు కోపోద్రిక్తుఁడై గోళ్ళతో గీఱుచు ముక్కుతో

బోడుచుచుండెను. వైనతేయుండు దేవతలతో బోరాడు నప్పుడు ఱెక్కల విదుర్పువలన లేవబడిన ధూళి వారల దృష్టిమార్గమును గప్పివైచెను. గరుత్మంతుని పక్షోద్ధూత పరాగంబునుఁ బోఁగొట్ట దేవేంద్రుఁడు వాయువును నియోగించెను. కాని యాతండునుఁ జెదరవీవఁబడెను. వానితోఁ బోరంజాలక దేవదానవులు పరువులిడఁ జొచ్చిరి. అంత గరుత్మంతుఁ డమృతకలశము చుట్టును నున్న యగ్ని చల్లార్చి దానిని గొని యాకాశంబున కెగసెను.

అమృతకలశంబునుఁ గొని చరితార్థుండ నైతి నని సంతోషించుచుఁ బోవుచుండ మహావిష్ణువు తన దర్శనపథమునఁ బడెను. విహంగపుంగవుండు నారాయణునకు సవినయముగ నమస్కరింప విష్ణుం డిట్లు పలికెను: "ఓ గరుఁడా! నీ ధైర్యస్థైర్యములకు మెచ్చితిని. శ్రమంబున సంపాదించిన దానిని నాస్వాదింపనైనను నాస్వాదింపక కొనిపోవుచున్నాఁడవు. అమృతము సేవించిన జరామరణ హరణ మగును. నీ నిరపేక్ష కడుం గొనియాడఁదగియున్నది. నీకుం గావలయు వరంబుఁ గోరుకొను మిచ్చెద" ననవుడు పక్షీంద్రుఁడు "ఓ దేవా! ఈ యమృతంబును మదీయ మాతృ దాస్యవిమోచనమునకై తీసికొని పోవుచున్నాఁడను. ఇది నా యుపయోగార్థ మెంతమాత్రమును గాదు. నీ యనుగ్రహ ముండినచో జరామరణ రహితుండ నగుట యెంత? నిష్కల్మష హృదయుండనై సర్వదా నీ సన్నిధానముననే యుండునట్లు వరమి"మ్మనిన విష్ణుండును వాని మనోవాంఛితము లొనగూర్పఁ దలంచి గరుడుని వాహనముగఁ జేసికొనియెను.

వైనతేయుఁడు విష్ణు ననుజ్ఞఁ గొని పోవుచుండ దేవేంద్రుండు వానివెంట పరుగెత్తుచుండెను. దేవేంద్రుండు వానిం గలిసికొనజాలక వజ్రాయుధంబు వానిపైఁ బ్రయోగించెను. అదియును నంబరంబున నగ్నికణంబులు చెదరం బఱతెంచి పక్షిరాజు పక్షంబులం దాకవచ్చిన యతం డిట్లనియె: "ఓ వజ్రమా! నీవు నన్నేమియుం జేయఁజాలవు. కాని నీవు మహామునిసంభవం బగుటవలనను నిన్నవమాన పరుపరాదు. కావున మదీయైకపర్ణశకలచ్ఛేదంబు గావింపుము. నాయందు నీకుఁగల శక్తి యింతియే" యన వజ్రాయుధము వానిపైఁబడి యేమియుం జేయఁజాలక వాని పక్షంబున నున్న యొాక నొకదానిని ఖండించెను. సకలభూత సంఘంబు లాతని పర్ణస్థిరత్వంబున కాశ్చర్యంబుఁ జెంది సుపర్ణుం డని నామం బొసఁగెను.

మహేంద్రుఁడు వజ్రాయుధపు యోగము వ్యర్థమగుటఁ గాంచి మిక్కిలి ఖేదంబు నొంది చేయునది లేక వానితో సఖ్యము గావింప నెంచెను. ఇది వాలఖిల్యుల యవమానము నకుఁ బ్రతిఫల మని గ్రహించెను. ఇంద్రుండు "ఓ సుపర్ణా! వజ్రప్రయోగమునకు మనంబున కినుక వహింపకుము. నీ వమరుండవు, అజరుండవు, అపజితుండవు. భూవలయము నంతను వీఁపునఁ దాల్పఁగల శక్తిమంతుండవు. పయోధిజలంబు నంతయుఁ బక్షబలంబుచే నెగఁజల్లఁగలిగిన జవశాలివి. ఇట్టి జనసత్వ సామర్థ్యంబులుఁ గల నీ కమృతముతోడి పనియేమి? నీవు దీని నేరికేనియు నొసంగిన వార లమృతపానమునఁ బోరునం దసాధ్యు లగుదురు. దాన ముప్పు వాటిల్లును.

కావున నాకది మగుడ నిమ్ము. నీకిష్టం బగు విధంబు నేఁగావించెద" ననెను. "ఏను మదీయ మాతృదాస్య విముక్తికై కాద్రవేయుల కమృతము నొసంగ నొడంబడితిని. కావున దీనిం గొని వారల కిచ్చి మదీయ జనని దాస్యంబు బాపుకొనవలయును. ఇట్లు చేయుట విధి. దీని నితరులు సేవించుట నీకిష్టముం గాదేని యే మాయోపాయంబునైనను వారలనుండి దానిని హరింపు''మని గరుడుండు పల్క నింద్రుం డిట్లనియె: "ఓ వైనతేయా! నీ సహాయంబునకు నే సంతసిం చితిని. నీ మాతృభక్తి పరాయణతకు మెచ్చితి. నీకిష్టం బగువరంబు కోరుకొ"మ్మన గరుత్మంతుఁడు "మహేంద్రా! మోసకృత్యంబున నా జననిచే దాస్యము గావించుకొనిన నాగజాతి నా కాహార మగునట్లు వరం బిమ్ము. ఈ పన్నగా శనత్వంబువలన నా కసి తీరును" అని కోరెను. మహేంద్రుఁడు వల్లె యని వానికి సెలవొసంగెను.

సుపర్ణుం డమృతమునుఁ గొని కాద్రవేయుల సమీ పించి వారల కిట్లనియె: "ఓ నాగులారా! మీరు కోరినరీతి నమృతంబుఁ దెచ్చితిని. దానంజేసి మదీయ మాతృదాస్య మును, దన్మూలంబున నా దాస్యంబును నేటితోఁ బాసినవి. అమృతకలశంబును దర్భలయం దుంచుచున్నాఁడను. దీనికి పంచభూతములు సాక్షులు. మీరలు మజ్జనంబుఁ గావించి సాలంకృతులై వచ్చి దీనిని గ్రోలుఁడు. నాతల్లినిం గైకొని నే నిదే పోవుచున్నవాఁడ"నని తల్లిం దన వీఁపుపై నెక్కించు కొని యదృశ్యుం డాయెను. కాద్రవేయు లమృతము లభించి నందులకు మిక్కిలి సంతోషమునుఁ జెందిరి. తమ కిక జరా

మరణ భయంబులు లేవనుకొనిరి. కద్రువ మాత్రము వారల దాస్యవిముక్తులఁ గావించినందులకు విచారించెను. కుమారుల నందరను గంగానదికి స్నానంబు గావింపఁ దోడ్కొని పోయెను. వా రుత్సాహాతిశయమున జలక్రీడలు సేయుచు కాలవిలంబముఁ గావించిరి.

వార లిట్లు కాలయాపన చేయుచుండ నింద్రుఁడు మాయవేషంబునఁ జనుదెంచి కుశాస్తరణంబున నున్న యమృతకలశంబు నపహరించి యమరావతికిం గొనిపోయి యథాస్థానంబున నునిచి సురక్షితముగఁ గాపాడుకొనుచుండెను. కాద్రవేయులు సాలంకృతులై విచ్చేసి యమృత కలశంబును గానక మిక్కిలి దుఃఖించిరి. కుశాస్తరణంబున నేమైనను పడియుండు నని తలఁచి వానిని నాకి నాలుకలు రెండుగా వ్రయ్యుటం జేసి ద్విజిహ్వు లైరి. అమృతంబు నుంచుటచేత దర్భలును పవిత్రము లయ్యెను. అది మహేంద్రుని కృత్రిమ మని తలంచిరి. కద్రువ మిక్కిలి విలపించెను. తా మమృతము గోలుపోవుటయే గాక గరుఁడునకు నురగ భోజనత్వ వరంబువలనఁ దమ కంత్యకాలము సమీపించిన దని తెలిసికొనిరి. మోసముచే వినతవలన దాస్యముఁ గొనినదానికిఁ బ్రతిఫల మని కద్రువను నిందించిరి. మోస మెన్నటికిని దాగఁజాలదు. కృత్రిమ ప్రవర్తనగల వా రిట్లే విచారింపవలసి యుందురు.

పన్నగాశనుండు నిజ జననిని తోడ్కొని పోవుచుండ దేవతాబృందము వాని నభినందించెను. మాతృ దాస్య విముక్తి గావించి ధన్యాత్ముం డాయెను. సుపర్ణుండు వినతను

కశ్యపునొద్దకుం గొనిపోయి యచ్చట విడిచి వారల సెలవు గైకొని విష్ణువాహనుం డగుటకు వెడలెను. శ్రీ మహావిష్ణువు దయాపూర్వకముగా నతనిని స్వీకరించెను. అతండు విష్ణు సన్నిధిని సుఖం బుండెను.

